ఓం.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ ప్రచురణములు

# మృగశీర్ష

లేక

# వేదకాల నిర్ణయము

శ్రీ లోకమాన్య బాలగంగాధర
తిలక మహాశయ కృతము




మానికొండ సత్యనారాయణశాస్త్రిచే
సంక్షిప్తాంధ్రీకృతము.

# రా జ పో ష కు లు

౧ శ్రీశ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్ బహద్దూర్ మన్నెసుల్తాన్ జయంతిపురం జమీందారుగారు.

౨ శ్రీశ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరుగారు గంపలగూడెము.

3 శ్రీశ్రీ బెల్లంకొండ రాఘవరావుగారు, అగ్రహారందారు.

# విషయసూచిక

# భూమిక

ఈగ్రంథమును శ్రీలోకమాన్య బాలగంగాధర తిలకుగారు ౧౮౯౨ సం॥ లండను నగరమున జరుగుచున్న ౯. వ. ప్రాచ్య మహాసభలో (9th Oriental Congress లో) నివేదించుటకై యొక చిన్న ఇంగ్లీషు వ్యాసముగ రచించిరి. పిమ్మట దీసిని విస్తరించి పుస్తకరూపముగ ప్రకటించిరి. దీనిపై పాశ్చాత్య పండితులొసంగిన యభిప్రాయముల నిందు బొందు పరుప యత్నించితిని. కాని, అవిసకాల మునకు నాకు అందకపోవుటచే వానినిందు ముద్రింపలేదు. వానినెట్లయినను సంపాదించి పర్యాయితీని పత్రికలతో ప్రచురింపగలను.

ఈ గ్రంథమును తెలిగించుటకు నాకెంతమాత్రమును అధికారము (సమర్థత) లేదని నేను తక్షణ మొప్పుకొని తీరవలెను. ఏలననగ:—నాకు జ్యోతిషశాస్త్ర జ్ఞానముగాని, ఋగాదివేద వాఙ్మయము నర్థము చేసుకొనగల సంస్కృత జ్ఞానముగాని లేదు. అయినను, యిట్టి అత్యుత్తమ గ్రంథము రచియింపబడి యిప్పటికి ముప్పది సంవత్సరములు దాటెనను యిట్టి గ్రంథ మొకటియున్నదను సంగతియే ఆంధ్రలోకమున కెరుకబడకపోవుట చాల విచారకరమని చింతించినవాడనై, శ్రీ భగవాన్ తిలకాచార్యులవారియందలి యపారమగు

భక్తి ప్రేమలచే, దీనినిక అజ్ఞాతముగ పడవేసియుంచుటకు సహింపజాలక—నా అసమర్థతనైనను గణింపక—దీనిని తత్క్షణమే తెలిగించి ప్రచురింప సాహసించితిని. నాకంటె సమర్థులైనవారీ గ్రంథ రచనకు గడంగినచో నెంతయో బాగుండెడిది. కాని, యింతవరకెవరును దీనినిగూర్చి యోచింపక పోవుటచే, నాబోటి అసమర్థుడే దీనికి సాహసింప వలసివచ్చెను. అయినను, యిందలి లోపములు నావిగను, సుగుణములు శ్రీ లోకమాన్యులవిగను భావించి ఆంధ్రలోకము నన్ను మన్నింతురుగాక.

ఈ గ్రంథ మందలి విషయము బహు క్లిష్టమైనది. ఇది నవలవలె చదివి పారవేయదగినదికాదు. ముక్కకుముక్క తెలిగించి పెట్టినచో జనసామాన్యమున కర్థముకాదు. అందుచే, యిందలి విషయము ప్రతివారికిని సాధ్యమైనంత తక్కువ శ్రమతో అర్థమై పోవునట్లు సులభశైలిని చాలవరకు స్వతంత్రరీతిగనే వ్రాసితిని. వ్యాకరణ సూత్రముల నంతగ పాటింపలేదు. అందులకై నన్నుమన్నింపుడని వైయాకరణులకొక నమస్కార బాణము వదలుచున్నాడను. అసలు విషయమేమో తత్క్షణమే తెలిసికొనుటకై ,,విషయపరిచయ,, మను చిన్నవ్యాసమునుకూడ ముందువ్రాసితిని కావున, దానినిట విస్తరింపపనిలేదు.

నేనీగ్రంథమును తెలుగున వ్రాసి చాలాకాలమైనది. నా వద్ద ధనములేమిచే దీని నెట్లు ప్రచురింతునాయని యోచించుచున్న కాలమున—పూర్వము అమరావతీ పట్టణము రాజధానిగ జేసికొని ఆంధ్రమహీమండలము నవక్రపరాక్రమంబున పరిపాలించి, విద్వత్పోషణచే తమకీర్తిని దశదిశల వెలుంగ జేసిన శ్రీ శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారి వంశీకులును, ప్రస్తుతము ముక్త్యేశ్వరపురము (ముక్త్యాల) నేలుచుండి తమకు వంశపారంపర్యముగ వచ్చుచున్న విద్వత్పోషణమే సహజాలంకారముగాగల శ్రీ శ్రీ చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దూర్‌గారి యనుజన్ములును, సహజపాండిత్యధనులును, సరస్వతీ పత్రికాధిపతులును నగు శ్రీ శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్ బహద్దూర్ మన్నేసుల్తాన్ జయంతిపురం జమీందారుగారు సహజౌదార్యముతోడను, నిర్వ్యాజానురాగముచేతను, శ్రీ లోకమాన్యులందలి నిర్మలభక్తితోడను యీ గ్రంథముద్రణకు తాముగవచ్చి తోడ్పడుట నాకు మహా విచిత్రసంఘటనముగ గన్పట్టెను. శ్రీ లోకమాన్యుని ఆత్మయే పైనగానుండి, నేచేయు యీ చిన్ని ప్రయత్నమందు ముచ్చటపడి, నన్నాశీర్వదింపనెంచి, శ్రీ రాజావారిని యీ రీతిగ ప్రేరేపించెనా యేమియని నాకప్పుడప్పుడు సందేహముతోచుచున్నది. ఏ మహనీయునియందలి భక్తిశ్రద్ధలచే నేనీగ్రంథమును ఆంధ్రలోకమునకెరుక పరుప

దలచితినో, ఏమహనీయుని ఆశీర్వచనబలిమిచే యీ కార్యము నిర్విఘ్నముగ నెరవేరినదని నాకు దృఢనిశ్చయము కుదిరెనో, అట్టి శ్రీ లోకమాన్యులవారి పవిత్రాత్మకే గ్రంథము సంకితమొనర్చుచున్నాడను.

సద్యః కాలమునకువచ్చి తోడ్పడిన శ్రీ రాజా వారికి నేనును, ఆంధ్రలోకమునుకూడ, సర్వదా కృతజ్ఞులమై యుండక తప్పదు. శ్రీ వారికి దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులొసంగి, సదా వారినిట్టి పవిత్రకార్యములొనర్చుటకే ప్రేరేపింపవలసినదని శ్రీ లోకమాన్యుల పవిత్రాత్మనుగూర్చి ప్రార్థించుచున్నాను.

ఓం తత్ సత్ బ్రహ్మార్పణమస్తు

శ్రీరుధిరోద్గారి సం॥
మార్గశిర శు ౭ లు
గురువారము,
బెజవాడ,
౧౩—౧౨—౨౩

ఇట్లు విన్నవించు విధేయుండు,
మానికొండ సత్యనారాయణశాస్త్రి.
అనువాదకుడు

# విషయపరిచయము

పాశ్చాత్యపండితులు ఐగుప్తీయసభ్యతయొక్క యతి ప్రాచీనత నంగీకరించినను, వారింకను భారతజాతీయసభ్యతయొక్క యనాదిత్వము నంగీకరించుటలేదు. మన జాతియొక్క ప్రాచీనదశను గుర్తెరుంగుటకై మనకు వేదములు దక్క వేరొండుగ్రంథాధారము లేవియు గానరాకున్నవి. ఈ వేదగ్రంథము లెప్పుడు వెలువడినవో తెలిసికొనగలిగినచో, మనజాతి యెంత ప్రాచీనమైనదో మన కెరుకపడగలదు. మాక్సిముల్లరు మొదలగు పాశ్చాత్యపండితులు కేవలము సారస్వతప్రమాణములనే యాధారముగ గొని వేదకాలము క్రీ॥పూ॥ ౧౨౦౦ సంవత్సరములకంటె వెనుకకు వెళ్లజాలదని సిద్ధాంతముజేసిరి. కాని యీపద్ధతి సరియైనది కాదనియు ఖగోళమందు గర్మసూత్రములచే కట్టువడి నియమానుసారముగ తిరుగుచున్న జ్యోతిర్మూర్తుల చలనాదుల ప్రమాణముగ గైకొని యీవేదకాలమును నిర్ణయించుట యుక్తమనియు శ్రీలోకమాన్య బాలగంగాధర తిలక్ గారు నిశ్చయించిరి. ఆప్రకారమే వేదగ్రంథములందచ్చటచ్చట చెదరిపడియున్న ఖగోళాంశములనెల్ల క్రోడీకరించి, వానినుండి నిర్దుష్టమగు సిద్ధాంతము నొకదానిని వెలువరించిరి. ఈ సిద్ధాంతమునుబట్టి తేలిన సారాంశమేమనగా, వేదకాలమును—దానిననుసరించి ఆర్యసభ్యతయొక్క ఆదిని—ఖండితముగ నిర్ణయించుటకు వీలులేదు. కాలగర్భములోనికి

చొచ్చుకొని పోగాపోగా, మనకు క్రీ॥పూ॥౪౦౦౦ సంవత్సరములవరకు ప్రబలప్రమాణములు గన్పట్టుచున్నవి; కాని వేదకాల మంతటితో ముగియలేదు. పైన యింకను పోవుటకు వీలున్నట్లు చిహ్నములు గన్పట్టుచున్నవి. ఎంతవరకు పోవచ్చునో మనము చెప్పజాలము. దానియొక్క కొన (లేక ఆది) కనిపించదు. ఏదికనిపించదో అది లేనట్లెంచవచ్చును. వేదములకు ఆదికనిపించలేదు కనుక వానికి ఆదియే లేదన్నారు. అనగా వేదములు 'అనాది' యన్నారు.

మనకు కనుపించని యీ 'ఆది'ని వదలివేసి మనకు గాన్పించుచున్నంతవరకుమాత్రమే పోయి చూతము. ఇట్లు చూడగ వేదకాలమిప్పటికి ౬౦౦౦ సంవత్సరములకు తక్కువగాదని శ్రీలోకమాన్యులు నిర్ణయించిరి. వీరీవిషయమై చేసిన కృషినంతయు "మృగశీర్షా" యను గ్రంథరాజమందు బొందుపరచిరి.

ఈభూగోళ మొక యిరుసుమీద దినమునకొక చుట్టు చొప్పున తిరుగుచుండును. ఈ యిరుసునకు సూటిగ బ్రహ్మాండగోళమందు గాన్పించు నక్షత్రమునకు ధ్రువనక్షత్రమని పేరు. ఈ ధృవనక్షత్రమునకు సూటిగ ఖగోళమధ్యనుండిబోయి దానిని రెండు సమభాగములుగచేయు వలయమునకే "ఖగోళమధ్యరేఖ" యనిపేరు. మరియు సూర్యుడు సంవత్సరమున కొకసారి ఖగోళమందొకానొక వలయము మీదుగ పోవును. దీనికి రాశిచక్రమనిపేరు. దీనియందు అశ్విన్యాది ౨౭ నక్షత్రము లున్నవి. ఇవి సూర్యుని మార్గ

ములోని మైలురాళ్లు. ఇప్పుడు చెప్పినయీ "ఖగోళమధ్యరేఖయు" రాశిచక్రమును రెండుతావులలో కలియును. ఈ తావులకే "విషువను" లని పేరు, ఒకటి వసంతవిషువత్. రెండవది శరద్విషువత్. సూర్యుడు వసంతవిషువత్ లోనికి వచ్చినప్పుడు వసంతఋతువు ఆరంభమగును. రాత్రింబగళ్లు సరిసమానముగ నుండును. ఈ వసంతవిషువత్ చాల ముఖ్యమైనది. ఈవ్యాసమందు విషువత్ అనగా వసంతవిషువత్ అనియే యర్థముచేసికొనవలెను.

కొన్నికారణములచేత విషువత్స్థానమునకు బహుసూక్ష్మమైన చలనముగలదు. విషువత్ బిందువు (Point) సూర్యున కభిముఖగముగ షుమారు ౨౬ వేల సం॥ల కొకచుట్టు (360 డిగ్రీలు) చొప్పున తిరుగును. అనగ, షుమారు ౭౨ సం॥ కొక డిగ్రీ చొ॥ రాశిచక్రము వెంట వెనుకకు తిరుగును. ఈ లెక్కప్రకారము ఋతువులు షుమారు ౨ వేల సంవత్సరముల కొకనెల చొ॥ వెనుకబడుచుండును. ఈ ప్రకారము పంచాంగముల నప్పటప్పటికి సంస్కరింపుచుండవలెను. ప్రస్తుతము మన పంచాంగములు విషువత్ రేవత్యంతమందున్నదను నూహతో వ్రాయబడుచున్నవి. కాని యీస్థితి యిప్పటిదికాదు. క్రీస్తుశకానంతరము షుమారు ౫౦౦ సంవత్సరములనాడు వరాహమిహిరుని కాలములో విషువత్ రేవత్యంతమందుండెను. ఆకారణముచేతనే, వరాహమిహిరుడు నక్షత్రమాలను అశ్వినితో ప్రారంభించి నూతనసంవత్సరాదిని వసంత విషువత్ వద్ద చైత్ర శు ౧ నాడు

ప్రారంభించెను. కాని యీ స్థితి యిప్పుడు మారిపోయినది. విషువత్ ఇప్పుడు రేవతినికూడ గడచి షుమారు ౨౦ డిగ్రీలు వెనుకకు నడచినది. అనగ, వసంతఋతువు మన కిప్పుడు ౨౦ రోజులు వెనుకబడినదని చెప్పవచ్చును. అందుచేతనే మనకు ఫాల్గుణ మాసారంభముననే ప్రకృతియందు వసంతోదయ మగుచున్నది; కాని పంచాంగములు మాత్రము తదనుగుణముగ మార్పు చెందలేదు. కావున సిద్ధాంతులెల్లరును యీ యంశమును గుర్తించి ౧౫౦౦ సం॥ల నాడు వరాహమిహిరు డేర్పరచినదానినే పట్టుకొని ప్రేలాడక విషువన్ బిందువుయొక్క చలనమును, అది ప్రస్తుతమిప్పుడున్న స్థానమును గుర్తించి తదనుగుణముగ వసంతోదయమును నూతన సంవత్సరాదిని మార్పుచేయుదురుగాక యని మనవి చేసికొనుచున్నాను.

ఇప్పటికి ౧౫౦౦ సంవత్సరములనాడు విషువద్బిందువు అశ్వినీనక్షత్రముయొక్క ప్రారంభములో నుండెనని చెప్పితిమి. ప్రాచీనగ్రంథములను పరిశీలించి చూచినచో విషువత్ ఒకప్పుడు భరణిలోను, అంతకంటె పూర్వకాలములో కృత్తికలలోను, మృగశీర్షలోను, పునర్వసులోనుకూడ నున్నట్లు నిదర్శనములు గన్పట్టుచున్నవి. కనుక, యీవిషువత్ స్థానములనుబట్టి ఆయా ప్రాచీనగ్రంథములయొక్క కాలములను నిర్ణయింపవచ్చును. రాశిచక్రమందు ౨౭ నక్షత్రము లున్నవి. కనుక, ఒక్కొక్క నక్షత్రముయొక్క యవధి 13⅓ డిగ్రీ లగును. విషువత్ ఒకడిగ్రీ వెనుకకు జరుగుటకు

72 సం॥లు పట్టునని చెప్పితిమి. ఒక నక్షత్రమును గడుచుటకు విషువత్ కు 13⅓×72=960 లేక షుమారు వెయ్యి సంవత్సరములు పట్టును. వేదాంగజ్యోతిషమను ప్రాచీన గ్రంథములో విషువత్ "భరణి"లో పదిడిగ్రీలలో నున్నట్లు చెప్పబడియున్నది. అనగ, వరాహమిహిరుని కాలమునుండి చూచినచో అశ్వినీనక్షత్రము 13⅓ లును + భరణిలో 10 డిగ్రీలును, మొత్తము 23⅓ డిగ్రీల దూరములో నున్నదన్న మాట. కనుక, యీ వేదాంగజ్యోతిషగ్రంథము వరాహమిహిరుని కాలమునకు (అనగా 480 A D. కి) 23⅓×72=1680 సంవత్సరములక్రిందట (అనగా, క్రీ. పూ. 1200 సం॥లనాడు) వ్రాయబడినదని తేలుచున్నది

ఇదేరీతిగ తైత్తిరీయ సంహితాకాలమునాటికివిషువత్ కృత్తికలలో నున్నట్లు తెలియుచున్నది. అనగా, వేదాంగజ్యోతిషకాలమునకు 14⅓ డిగ్రీల దూరములో నున్నదన్నమాట. దీనినిబట్టి లెక్కవేసిచూడగా తైత్తిరీయసంహితాకాలము క్రీ పూ. 2232 సం॥లు అని తేలుచున్నది. ఈతైత్తిరీయ సంహితయందే విషువత్‌బిందువుయొక్క ప్రాచీనస్థానములు సూచింపబడినవి వీనినిబట్టి విషువత్ ఒకప్పుడు మృగశీర్షలో నున్నట్లుచెప్పుటకు ఖండితమైన ప్రమాణములను శ్రీ లోకమాన్యులు చూపించిరి. అనగా, కృత్తికలనుండి 28⅓ డిగ్రీల దూరములో నున్నదన్నమాట. లెక్కప్రకారము క్రీ. పూ. 4320 సంవత్సరములగు ప ఈసా ము ను స్థిరపరచుటకే, అనగా, విషువత్ ఒకప్పుడు మృగశీర్షలో నుండెనని

నిరూపించుటకే, శ్రీ లోకమాన్య లీగ్రంథమం దెక్కువగ కృషిసలిపిరి. అందుచేతనే యీగ్రంథమునకు మృగశీర్షయని పేరు పెట్టిరి.

శ్రీలోకమాన్యు లంతటితో తృప్తిజెంద లేదు. విషువత్ స్థాన మొకప్పుడు 'మృగశీర్ష' కంటె యింకను ప్రాచీనకాలముగో 'పునర్వసు' నక్షత్రములోకూడ నుండెనని నిరూపించుటకు యత్నించిరి. కాని దీనికి ఒకటి, రెండు నిదర్శనములు తైత్తిరీయసంహిత మొదలగు గ్రంథములందు గాన్పించినను, యీస్థానమును ఖండితముగ సిద్ధాంతీకరించుటకు తగినన్ని ప్రబల సాక్ష్యములు గానరామిచే వారు 'మృగశీర్ష' తోనే తృప్తిజెంది, పునర్వసు స్థానమును మాత్రము కొద్దిగ సూచించి, దీనిని స్థిరపరుచు భారమును భావిపరిశోధకులకు వదలివేసిరి. ఈపునర్వసుస్థానమును స్థిరపరచినచో వేదకాలము నింకను క్రీ॥ పూ॥ 6240 సం॥ల వరకు తీసికొనిపోగలము. ఈరీతిగ పరిశోధనలు చేసినకొలదియు వేదకాలము ముందునకు జరుగుచునే యుండును. దీనియొక్క 'ఆది' కానవచ్చుట బహుదుర్లభముగ నున్నది. దీనికి 'ఆది'యే లేదనికాదు! ఉన్నది. ఉండితీరవలెనని శ్రీలోకమాన్యుల యభిప్రాయము. కాని, యది కాలగర్భమం దెచ్చటనో మాయమైపోయినది. అందుచే మనకది గాన్పించుటలేదు; కనిపించినవస్తువు లేనట్లే. కనుక వేదములకు 'ఆది' లేదని మనవారనిరి.

వేదకాలము క్రీ॥ పూ॥ ౪౦౦౦ సం॥లకు తక్కువగాదని శ్రీలోకమాన్యులు సిద్ధాంతీకరించిరి. ఇంతటితో వేదకాల

నిర్ణయము పూర్తిగా లేదు. ఇంకపైన యెన్ని వేలసంవత్సరము లున్నదో తెలియదు. కాలగర్భమును త్రవ్వగ, త్రవ్వగ, శ్రీ లోకమాన్యులు క్రీ॥ పూ॥ ౪౦౦౦ సం॥ల వరకు పోగలిగిరి. పైనయింకను పోవుటకు మార్గమున్నదని సూచించిరి. ఈ మార్గము వెంట కాలగర్భమును పెకల్చుకొనిపోయి, పోయి, వేదకాలముయొక్క ఆదిని పట్టుకొనగల మహామహు లెవ రైననింక పుట్టుదురో పుట్టరో! అట్టివారుజన్మించువరకు వేదములు అనాదియనుమాట నిలిచియుండక తప్పదు.

# మృగశీర్ష

లేక

# వేదకాలనిర్ణయము

## ప్రథమాధ్యాయము

సృష్ట్యాదినుండియు మానవకోటి యేయేరీతుల పరిణామమునొందెనో తచ్చారిత్రమునంతను దెలిసికొనుటకు మనకు వేదములుదక్క వేఱొండు ఆధారము లేమియుఁగానరావు. గౌతమబుద్ధుని యవతారము, అలెగ్జాండరు దండయాత్రలు, అశోకుని శిలాశాసనములు, చైనాయాత్రికుల వ్రాఁతలు మొదలగునవి మనలను కొంతవరకు మాత్రమే తీసికొని పోఁగలవు. కాని మనలను సృష్ట్యాదికిఁ గొనిపోఁగల సాధనము లీయొక్క వేదములే తక్క. వేఱొండు గ్రంథములుగాని నిదర్శనములుగాని గానరావు. కనుక ప్రాచీనమహర్షు లీవేదగానము నెప్పు డొనర్చిరో. యెన్ని వేల సంవత్సరముల క్రిందట నొనర్చిరో నిర్ణయించుట చాలయవసరము. కాని యీపని బహుదుర్ఘటమైనది. ప్రాచీనకాలపు చరిత్రాంశములు మిక్కిలి యంధకారబంధురమై యేరికిని జొరనశక్యముగ నున్నవి. అత్యధిక మేధావంతులగు పండితులకే యీపని దుర్ఘటమైనట్లు తోఁచెను. వేదకాలమును నిర్ణయించుట కసలు సాధ్యమగునా? కాదా? యనుసంశయమే చాలమందికిఁ

గలిగెను. ఇట్టిదుర్ఘటకార్యమునకు నే నిప్పుడు పూన సాహ సించితిని కాని నేనైనను యీయంశమును సమగ్రముగఁ బరిష్కరింపఁగలిగితి నని చెప్పఁజాలను. అయినను నే నీవిష యములో చేసినకృషిని నాపరిశోధనలను పండితులయెదుట ప్రసాదించుచున్నాను. వీనివలన వేదముల యతిప్రాచీనతను నిర్ణయించుట కేమైన సులభమార్గ మేర్పడునేమో పండితు లే నిర్ణయించుకొందురుగాక

వేదకాలనిర్ణయమునకై యిదివఱలో పాశ్చాత్యపండితు లేయేమార్గముల నవలంబించియుండిరో ముస్ముందు వాని నిటఁ బరిశీలించి చూచెదముగాక మేక్సుముల్లరుపండితుఁ డు వేదవాఙ్మయమును నాలుగుభాగములుగ విభజించెను. అవి యేవనగ: ఛందస్సు, మంత్రము బ్రాహ్మణము, సూత్ర ము. ఈనాలుగుభాగములును క్రమముగ ఒకదాని వెంబడి మఱియొకటి ప్రచారములోనికి వచ్చెనఁట; ఒక్కొక్కవిభాగ ము ౨౦౦ సంవత్సరములు ప్రచారములో నుండెనఁట; ఈ ప్రకారము చిట్టచివరిదియగు సూత్రభాగముపూర్తియగునప్ప టికి ౨౦౦×౪=౮౦౦ సంవత్సరములు పట్టెనఁట, ఈసూత్ర యుగము పూర్తికాకముందే బౌద్ధమతము ప్రబలెనఁట, బౌద్ధమ తము క్రీస్తుకు పూర్వము నాలుగవశతాబ్దియందు ప్రబలె నఁట, కనుక వేదములు రచింపబడి మొత్తము క్రీస్తుకుపూర్వ ము ౪౦౦+౮౦౦=౧౨౦౦ సంవత్సరములకంటె యెక్కువ కాలముకాలేదని మేక్సుముల్లరుపండితుఁడు నిర్ణయించెను. (అనఁగ నిప్పటికి ౧౯౦౦+౧౨౦౦=3౧౦౦ సం॥లకంటె

నెక్కువకాలము కాలేదని యీపండితుని యభిప్రాయము)
వేదవాఙ్మయము నీరీతిని నాలుగుభాగములుగ విభజింప
వీలున్నదని యంగీకరించినను ఒక్కొక్కభాగమునకు ౨౦౦
సంవత్సరములకాలమునే యేల నిర్ణయించవలెను? ఎక్కువ
యేల నిర్ణయింపఁగూడదు? లేదా తక్కువ యేల నిర్ణయిం
పఁగూడదు? డాక్టరు హేగు అనుపండితుఁడు ఒక్కొక్కభా
గమునకు ౫౦౦ సంవత్సరము లని నిర్ణయించెను. ఇది కేవ
లము ఊహించిచెప్పినమాట; ఊహకు మేరలేదు. రేపు ఇం
కొకపండితుఁడు వచ్చి ఒక్కొక్కభాగమునకు వేయిసంవ
త్సరము లని చెప్పవచ్చును, కనుక కేవలము సారస్వతవిభా
గముపై ఆధారపడి ఊహించిచెప్పెడియీపద్ధతి మన కంతగ
నుపకరింపదు. కనుక మన మింకొకమార్గము నారయవలసి
యున్నది.

వేదములందును, తదంగములందును అచ్చటచ్చటఁగొన్ని
ఖగోళాంశములుగలవు. నక్షత్రములయొక్కయు, సూర్యచం
ద్రాదుల యొక్కయు గతులనుగూర్చి కొన్ని నిదర్శన
ములు వేద వేదాంగములందుఁ గలవు. వీనియాధార
మున వేదకాలమును నిర్ణయించుటకు వీలుండునని కొంద
ఱూహించిరి కాని వారి యత్నములు సఫలత నొంద
లేదు. కారణ మేమనఁగ ఒక్క "వేదాంగజ్యోతిషము''
తప్ప తక్కిన ఖగోళశాస్త్ర గ్రంధములన్నియు ప్రాచీన
కాలపు సంస్కృతభాషలోఁగాక తదుపరి వెలువడినసం
స్కృతభాషలో వ్రాయబడియున్న కారణముచే ఈపని

కష్టసాధ్యమయ్యెను. అదిగాక. గ్రీకుల గణిత పద్ధతి కూడ ఈగ్రంథములలో కొంతవఱకు అనుసరింపఁబడినది. అనేకగ్రంథములలో అనేకగణితపద్ధతులు అవలంబింపఁబడి యున్నవి. విక్రమశకానంతరమున భారతవర్షమునందనేక శకము లేర్పడెను. బార్హస్పత్యమాన మేర్పడెను. గ్రీకుల పద్ధతి ననుసరించి మేషాదిద్వాదశరాసు లేర్పడెను. ఇన్ని యసందర్భముల కూటమిచే వేదవాఙ్మయమందు అచ్చటచ్చట చెదరిపడియున్న ఖగోళశాస్త్రసంబంధములగు వాక్యములకు సరియైనయర్థముచెప్పి వానికి ఏకవాక్యతను చేకూర్చి వానిలోనుండి నిర్దుష్టమైన సిద్ధాంతమును వెలువరించుట బహుకష్టసాధ్యమైనది. ‹నక్షత్రములు› సంఖ్య యిరువదియేడా? లేక యిరువదియెనిమిదియా? అనువాదము వచ్చి యీపనిని మఱింత అయోమయముగఁ జేసెను అదిగాక, అప్పటిబ్రాహ్మణులకు ఆకాశమునందుండు నక్షత్రాదుల నంతిసూక్ష్మముగఁ బరిశీలింపఁగల తెలివితేటలున్నవాయను అనుమానము కొందఱిని బాధింపజొచ్చెను. ఈకారణముచేఁగూడ వేదకాలనిర్ణయమునకు కొంతఆటంకము గలిగెను.

ఇట్టిశంకలు మనస్సునందుండుటచే ప్రాచీనగ్రంథములలోనున్న ఖగోళశాస్త్రసంబంధమగు వాక్యములను పాశ్చాత్యపండితు లెవరును నమ్మలేదు. వానిని పాటింపలేదు. ఈ పాశ్చాత్యపండితు లీవిషయములో అనవసరముగ భయపడిరని నానమ్మకము. అసలే కష్టములు లేవని కాదు- అప్రస్తుతమును అనవసరమును నగుచిల్లరయంశములనుగూర్చి వాద

ప్రతివాదములకు దిగుటచే పాశ్చాత్యపండితులు ప్రధానాంశమగు నీవేదకాల నిర్ణయమును గూర్చి తగినంతశ్రద్ధ వహించినట్లు గాన్పించదు జ్యోతిషగ్రంథములలోను వేదసంహితులలోను నున్నయంశములను సమన్వయించి దానివలన వేదకాలనిర్ణయ మొనర్చుట కేమైన వీలున్నదో లేదో యని పాశ్చాత్యపండితులు యత్నింపనైనలేదు. మీదు మిక్కిలి యిట్టిప్రయత్నములవలన నెంతమాత్రమును లాభములేదని "వీబర్" పండితుఁడు వక్కాణించెను. కాని మన మింత మాత్రముచే నిరాశఁజెందవలసినపని లేదని యీగ్రంథమునందు వివరించెదను. వేదముల యతిప్రాచీనతను నిర్ణయించుటకు తగినన్ని నిదర్శనములు ప్రాచీనసంహితా గ్రంథములందుఁ గలవని ఋజువుపఱచెదను. నేను ముఖ్యముగ అతి పురాతన గ్రంథములగు సంహితాబ్రాహ్మణములను, ఋగ్వేదమును మాత్రమే ప్రమాణముగఁ గైకొందును. పురాతన గ్రంథములలోనియంశములను బలపఱచుటకుమాత్రమే యిటీవలిగ్రంథములను సాక్ష్యముగఁ గైకొందును ప్రధానాంశములనన్నిటిని వేదసంహితులనుండియే ఋజువుపర్చెదను.

పాశ్చాత్యపండితులేగాక మనభారతవర్షీయులగు పండితులుకూడ యీవిషయమై కొంతకృషి సలిపియుండిరి. కీర్తిశేషులగు క్షత్రి, కృష్ణశాస్త్రిగార్లును, శంకర బాలకృష్ణదీక్షితులుగారును ఈవిషయమై కొంతకృషి సలిపినమాట వాస్తవమే కాని వారిప్రయత్నములు తగినంత ప్రచారమునకు రాకపోవుట కడుశోచనీయము. నే నీగ్రంథములో చాల

భాగము వారుచేసిన కృషి ననుసరించియే సిద్ధాంతముఁజేసి యుంటిని ఒకవిధముగ నాయీప్రయత్నము వారుప్రారంభించినదానికి పూరణ మని చెప్పినఁజెప్పవచ్చును. అందుచే నేనీపండితుల కెంతయుఁ గృతజ్ఞుఁడను

# ద్వితీయాధ్యాయము

—♦ సంవత్సరము లేక యజ్ఞము ♦—

ప్రస్తుతము భారతవర్షమం దనేకవిధములగు కాలమానములు ప్రచారములో నున్నవి చాంద్రమానము బార్హస్పత్యమానము సౌరమానము నక్షత్రమానము సవనమానము మొదలగునవి వివిధప్రాంతములలో ప్రచారములో నున్నవి. కొన్నిచోట్ల తిథులును మాసములును చాంద్రమానము ననుసరించియున్నవి. సంవత్సరముమాత్రము సౌరమాన మనుసరించి యున్నది. సాధారణదినములను తిథులతో సరిపుచ్చుటకును చాంద్రమాసములను సౌరమాసములతో సరిపుచ్చుటకును పలుతెఱగులగు క్లిష్టపద్ధతు లవలంబింపబడి యున్నవి. కాని యోచించిచూడగ, ప్రాచీనకాలమం దిన్ని రకముల కాలమానము లున్నట్లు గాన్పింపదు. ఇవన్నియు నిటీవల ప్రబలినవి.

వేదకాలమం దున్న పంచాంగపద్ధతి యెట్లున్నదో తెలిసికొనుటకు మనకు వేదాంగజ్యోతిష మనుచిన్నిగ్రంథము దప్ప వేఱొండు ఆధారము లేమియు విశేషించి కానరావు. కనుక వేదకాలమునాటి పంచాంగపద్ధతిని తెలిసికొనుటకు మనకు రెండే ఆధారములు గలవు. ఒకటి:—వేదసంహితలయం దచ్చటచ్చట చెదరిపడియున్న ఖగోళశాస్త్రసంబంధమగు వాక్యములు గాని లేక రెండు:—అతిప్రాచీనములగు

యజ్ఞయాగాదికర్మకాండలలో నుదహరింపఁబడిన ఆచార వ్యవహారములు గాని మన కిప్పుడు ముఖ్యాధారములై యున్నవి. వేదములలోని ఋక్కులనుబట్టి చూచినచో ఆకాలమున యజ్ఞయాగాదికర్మకాండము విశేషముగ విజృంభించియున్నట్లు స్పష్టముగా గలదు. తిథి వార నక్షత్రములు మాసములు ఋతువులు మొదలగు కాలమానములు పూర్తిగ తెలిసిననేగాని యజ్ఞయాగాది కర్మకాండలు అంతవిరివిగ జరిగియుండజాలవు. కనుక యెప్పు డేయేక్రతువులను చేయవలెనో ఎప్పు డేయేకర్మకాండమును జరుపవలెనో స్పష్టముగ దెలిసికొనుటకు అప్పటివారికొక పంచాంగముండితీరవలెను. ఈపంచాంగముయొక్క సంపూర్ణస్వభావమును నిర్ణయించుట కష్టము. అయినను, మన పూర్వుల యజ్ఞయాగాదికర్మకాండలను పూర్తిగ బరిశీలించి చూచినచో ఈపంచాంగముయొక్క స్వభావమును కొంతవఱకు మనము గ్రహింపవచ్చును. అట్లు పరిశీలింపగ మనకు రెండుప్రధానాంశములు గోచరించుచున్నవి. ఒకటి:——చంద్రునివృద్ధిక్షయములు, ఋతువులమార్పులు, సూర్యునిఉత్తర దక్షిణయానములు—— ఇవన్నియు మనపూర్వులకాలమానములో ప్రధానాంశములుగఁ గన్పట్టుచున్నవి, రెండు:——యజ్ఞాదిక్రతువులలోని ప్రధానాంశములే సంవత్సరమునకుఁ గూడ ప్రధానాంశములుగఁ గన్పట్టుచున్నవి. ఐతరేయబ్రాహ్మణమున కుపోద్ఘాతము వ్రాయుచు కీర్తిశేషుఁడగు హేగు పండితుఁ డిట్లు వచించియున్నాఁడు:—— ‘‘సంవత్సరముపోడు

గునను జరుగు సత్రిములు (అనగ యజ్ఞములు) కేవలము సూర్యుని వార్షికగమనమునకు సరియైన నకలని చెప్పవచ్చును. ఈసత్రిము లన్నియు రెండుభాగములుగ విభజింపబడినవి. ఒక్కొక్క భాగము ఆఱుమాసములవఱకుండును (మాసమునకు ముప్పది దినములు) ఈరెండుభాగములకును నడుమ ‚‚విషువత్'' గలదు. (‚‚విషువత్'' అనగ మధ్యదినము.) ఈదినము ఈసత్రము నంతటిని రెండుసమభాగములుగ విభజించుచున్నది. కనుక మనఋషీశ్వరులు యజ్ఞయాగాదిక్రతువులను నడుపుకొనుటకే పంచాంగమును నిర్ణయించుకొనిరని స్పష్టమగుచున్నది. మఱియు ఈక్రతువులను కాలమానప్రకారము నడుపుకొనుటచేత పంచాంగనిర్మాణముకూడ దానియంతటయదియే జరుగుచుండెడిది. ఈవిధముగ పంచాంగముచేత క్రతువులును క్రతువులచేత పంచాంగమును అన్యోన్యాశ్రయముగ నడచుచుండెడివి సాయంప్రాతముల యందును పూర్ణిమామావాస్యలయందును, ఋతుప్రవేశముల యందును అయన ప్రవేశములయందును హోమములును బలులును అర్పింపబడెడివి. [బౌ. సూ. II, 4-23. అగ్న్యాధేయ ప్రభృత్యథేమాన్య జస్త్రాణి భవంతి యథైతదగ్న్యాధేయ మగ్నిహోత్రం దర్శపూర్ణిమాసావాగ్రయణ ముదగయన దక్షిణాయనయోః పశుశ్చాతుర్మాస్యాన్యృతుముఖే షడ్ఢోతా వసంతే జ్యోతిష్టోమ ఇత్యేవం క్షేమప్రాపణం॥—]

ఈరీతిని క్రతువులన్నియు పూర్తికాఁగానే సంవత్సరము కూడ పూర్తియయ్యెడిది. ఆకారణముచేతనే, "సంవత్సర

ము," "యజ్ఞము"— అను రెండుపదములును సమానార్థకము లయ్యెను. "సంవత్సర" మన్నను, "యజ్ఞ" మన్నను ఒకటే అర్థమని సంహితాబ్రాహ్మణములయం దనేకస్థలముల ఘంటాపథముగ వక్కాణింపఁబడియున్నది. [ఐ. బ్రా. II, 17. సంవత్సరః ప్రజాపతిః ప్రజాపతిర్యజ్ఞః॥

తై. సం. II, 5, 7, 3 VII, 5, 7, 4. యజ్ఞోవై ప్రజాపతిః॥

VII. 2, 10, 3 సంవత్సరః ప్రజాపతిః॥

ఈవాక్యములను సమర్థించుటకు నేను పైనఁ జెప్పిన సిద్ధాంతముదక్క వేఱొండుసమాధానము గానరాదు.

కనుక వేదకాలమునాఁటి ఋషులు తమగృహములలో సదా అగ్నిహోత్రము నుంచుకొనెడివా రనియు, ఆయగ్నిహోత్రమునందు సంవత్సరముపొడుగునను హోమము లర్పించుచు, కాలమానము ననుసరించి క్రతువు లొనర్చుచుండెడివా రనియు, ఈక్రతువుల ననుసరించి తమపంచాంగమును కాపాడుకొనుచుండెడివారనియు నాయభిప్రాయము. బ్రాహ్మణములలో విరివిగ వర్ణింపఁబడిన విపులమగుకర్మకాండమంతయు తదుపరి పెరిగియుండవచ్చును. కాని, ప్రధానాంశమగు వార్షికయజ్ఞములుమాత్రము చాల పురాతనములైనవనుమాట స్పష్టము. ఋత్విజ్ (ఋత్+యజ్) అను

పదముయొక్క వ్యుత్పత్త్యర్థముకూడ దీనినే బలపఱచుచు న్నది. ఋతువులకును, యజ్ఞములకును సన్నిహితసంబంధ మున్నట్లు స్పష్టమగుచున్నది. దీనినిబట్టి సంవత్సరమునకును యజ్ఞమునకునుగూడ సంబంధ మున్నదని వేఱుగఁ జెప్పన క్కఱ లేదు. ‘‘సంవత్సర’’పదముయొక్క వ్యుత్పత్త్యర్థ మేమి? (వస్=నివసించు) అనఁగ ఋతువులు వసించుకాలపరిమాణ మునకు ‘‘సంవత్సర’’ మని పేరు. పూర్వము యాజ్ఞికులకు యజ్ఞములు చేయుటయేగాక, కాలమానాదుల దెల్పుపంచాం గమును సంరక్షించుటకూడ విధ్యుక్తధర్మముగ నుండెను. పూర్వము రోమకసామ్రాజ్యములోగూడ పంచాంగమును సంరక్షించు బాధ్యత మతగురువుల యందే యుండెను. ఇది యొకపవిత్రకార్యముగ భావింపఁబడెడిది. కనుక, పూర్వ ము మనయాజ్ఞికులు ఈరెండుధర్మములను సమన్వయించి సంవత్సరముపొడుగునను వచ్చుక్రతువులను సంవత్సరములో ప్రధానదినములందే ప్రారంభించెడివారు. ఈరీతిని క్రతువు లచే కాలమానము నడచుచుండెడిది. కాని, యిటీవల కాల మానమును నిర్ణయించుటకు ఉపాయాంతరములు ప్రబలు టచే యాక్రతువులకు కాలమానమును నిర్ణయించుపని తప్పి పోయెను. అప్పటినుండి క్రతువులును కాలమానమును వేఱ గుటయు, ఈరెండును స్వతంత్రరీతుల పలుతెఱఁగు లగుపరి

ణామములఁ బొందుటయు తటస్థించెను. అప్పటినుండియే యజ్ఞయాగాదులలో కర్మకాండమంతయు పలురీతుల పెరిగిపోయెను. కనుక, వార్షికసత్రములే పంచాంగము యొక్క ప్రథమదశ యని సిద్ధించుచున్నది. సంవత్సరములోని వివిధ విభాగములనుగూర్చి యోచించుదము.

(౧) సవనమానము:—"సవన" దినము స్వాభావికమగు కాలపరిమాణముగఁ గైకొనఁబడినది. (సవనదినమనగ సూర్యోదయము మొదలు మరల సూర్యోదయమువఱకు). ఇది మన మామూలుదినము. ౩౦ సవనదినములు కలిసి ఒక సవనమాసమగును. ౧౨ సవనమాసములు లేక ౩౬౦ సవనదినములు కలిసి ఒకసవనసంవత్సరము.

(౨) చాంద్రమానము:— వ్యుత్పత్త్యర్థమునుబట్టి చూచినచో మాసమునకును చంద్రునకును సన్నిహితసంబంధ మున్నట్లు స్పష్టమగుచున్నది. కనుక చంద్రునిగతినిబట్టియే మాసములు నిర్ణయ మగుచువచ్చెను చంద్రునిగతినిబట్టి (అనగ చాంద్రమానమునుబట్టి) నెలకు ముప్పదితిథులు; సంవత్సరమునకు ౩౬౦ తిథులు. తిథికిని మామూలుగ మనము చూచు సవన దినమునకును భేదమున్నది. ౬౦ తిథులకంటె ౬౦ సవనదినములు ఎక్కు వగుచువచ్చెను. కనుక, యీ తెంటిని సరిచేసుకొనుటకై కొన్ని సవనమాసములలో ఒక్కొక్కదినము తగ్గించవలసివచ్చెను [తై॥సం॥ VII, 5, 7, 1 ఉత్సృజ్యా ౩ నోత్సృజ్యామితి మీమాంసంతే బ్రహ్మవాదినః॥]

ఈరీతిగ మొత్తముమీద ఆఱు సవన దినములు తగ్గింపఁ బడెను. కనుక 354 సవన (మామూలు) దినములు=360 తిథులు.

(3) సౌరమానము:— ఇంతటితో పూర్తికాలేదు. ఈ చాంద్రమానమును సౌరమానముతో సరిపుచ్చుకొనవలెను. సౌరమానమనఁగ సూర్యునిగతినిబట్టి నిర్ణయింపఁబడు మానము. సూర్యుఁడు ఒకచుట్టు తిరిగివచ్చునప్పటికి 366 సవన దినములు పట్టును (అనఁగ, సూర్యుఁడు ఆలస్యముగ తిరుగును.) ఆకాలమునాటికింకను మేషాదిరాసులు మనగణితములోనికి రాలేదు. ఇవి గ్రీకుసంపర్కమునుండి వచ్చినవి. కనుక, సౌరమాసములు ఇప్పటివలె మేషమాస మనియు, వృషభమాసమనియు లెక్కింపఁబడుచుండుట లేదు. అప్పుడు సౌరమాసములు కేవలము ఋతువుల మార్పులనుబట్టియే యుండెడివి. ఏదో ఒకఋతువుతో సంవత్సరము ప్రారంభమయ్యెడిది. తక్కినఋతువు లన్నియుక్రమముగ పూర్తియై తిరిగి ఆఋతువు వచ్చినప్పుడే మరల సంవత్సరము ప్రారంభమయ్యెడిది. ఇది సౌరమానపద్ధతి. ఈప్రకారము సౌర సంవత్సరము పూర్తియగునప్పటికి 366 మామూలు దినములు పట్టునని చెప్పియుంటిని చాంద్రసంవత్సరమునకు 354 దినములే యనికూడ చెప్పియుంటిని.కనుక యీ రెండు రకముల సంవత్సరములకును (366—354) 12 దినములు భేదమున్నది. అనగ చాంద్రవత్సరము సౌరసంవత్స

రమునకంటె ౧౧ దినములు ముందుగనే పూర్తియయ్యెడిది. కనుక దీనిని సౌరసంవత్సరముతో సరిచేసికొనుటకై చాంద్ర సంవత్సరమునకు ౧౧ దినములు అధికముగ కలుపవలసి వచ్చెను. ఈరీతిగ చాంద్రసౌరమానములను సరిచేసికొనుటకై అధికదినములను లేక అధికమాసములను చేర్చుకొనవలసివచ్చెను. ఋగ్వేదమునందును, తైత్తిరీయ, వాజసనీయ సంహితలయందును అధికమాసములనుగూర్చి స్పష్టముగఁ జెప్పఁబడియున్నది [తై. సం. I. 4, 14; వాజసనేయసంహితా 7, 30, ఋ. I, 25, 8. ఋ. IV, 33, 7; అథ. వే. IV, 11, 11, తై. బ్రా ,I, 1, 9, 10.]

సౌరచాంద్రమానములకు ౧౧ దినములు భేదమున్నది. దీనినే, ఋ I, 33 లో ఇట్లు వర్ణించియున్నారు ఋతువుల కధిష్ఠానదేవతలగు "ఋభువులు" తమగమనవేగమును తగ్గించుకొని సంవత్సరముపొడుగునను తాము పడినశ్రమనంతయు బాపుకొని, సూర్యుని దయవలన కొంతకాలము హాయిగ సుఖించుచున్నారు." మఱియు, అథర్వవేదము [IV, 11, 11] లో నిట్లని వర్ణింపఁబడినది. "యజ్ఞాధిష్ఠానదేవతయగు ప్రజాపతి ప్రాతసంవత్సరపు యజ్ఞమును పూర్తిచేసిన పిమ్మట, తిరిగ క్రొత్తసంవత్సరపు యజ్ఞమునకై కావలసిన యేర్పాట్లను చేసికొనుటకు కొంతవ్యవధి గావలె"నట. సౌరచాంద్రమానములకుగల ౧౧ దినములవ్యత్యాసమే యీ వ్యవధి యని యూహింపవలెను. ఈ ౧౧ దినములను మనవారు యజ్ఞాదికర్మకాండలలో వదలిపెట్టకుండ తీసికొనియే

వచ్చుచున్నారు. సంవత్సరయాగములను చేయఁదలచుకొనిన వారెవ్వరైననుసరే ౧౨ దినములు (ద్వాదశాహము) యజ్ఞోపక్రమణపూర్వకముగ కొన్నికర్మలను చేయవలెనని మనవారు నియమించియున్నారు కనుక, సౌరచాంద్రమానములను సరిపుచ్చుటకు మనవారొక యుపాయమును కనిపెట్టిగలిగి రనుట స్పష్టము ఏసంవత్సరమున కాసంవత్సరము చివరనే యీ ౧౨ దినములను కలిపెడివారా? లేక వీనినన్నిటిని చేర్చి ఒకపర్యాయమే—ఒకయధికమాసముగ ఏర్పాటుచేసెడివారా? అనునది వివాదాంశము. కాని నాకుఁ జూడగ, పూర్వము ఏసంవత్సరమున కాసంవత్సరము చివరనే యీ ౧౨ దినములను కలుపుచుండెడివారని నాయభిప్రాయము. ఏల ననఁగ; అప్పటి వార్షికయజ్ఞములనుబట్టి చూడగ ఈపద్ధతియే ప్రచారములో నుండియున్నట్లు గాన్పించుచున్నది.

సౌరచాంద్రమానములకుఁ గలయీభేదమును గనుఁగొని సరిపుచ్చుకొనగల తెలివితేటలు ప్రాచీనపుటార్యులకు లేవని 'వీబరు' మొదలగుపాశ్చాత్యపండితులు ఆక్షేపించుచున్నారు. నిజపరిస్థితులు కండ్లకుఁగట్టినట్లు స్పష్టముగఁ గాన్పించుచున్నను, శంకాకళంకితదృష్టితోఁ జూచు నీపండితులకవి గాన్పింపకపోవుట బహువిచిత్రము.

చంద్రునిగతినిబట్టి మాసముల నిర్ణయించుకొనుచు, సూర్యునిగతినిబట్టి సంవత్సరముల నిర్ణయించుకొనుచు, యీ రెంటికిఁ గలభేదమును ఋతువులమార్పుచేఁ గనిపెట్టుచు

యీభేదమును అధిక దినములచేగాని, అధికమాసములచే గాని సరిపుచ్చుకొనుచు, మనప్రాచీనపుటార్యులు కాలమానములఁ దెలిసికొనుచుండెడివా రని నాతాత్పర్యము. వేదకాలమునాఁటి పంచాంగపద్ధతి యిదియే యని నాయభిప్రాయము.

సౌరమానముకూడ స్థిరమైనది కాదు. దీనిలోఁగూడ రెండువిధములసంవత్సరము లున్నవి. ఇట్లు రెండువిధము లుండుటకు కారణమేమో దెలిపెదను. ఖగోళమధ్యరేఖయు, రాశిచక్రమును కలియుచోటికి "విషువత్" అనిపేరు. అది ఒకబిందువు (Point) మాత్రమే. ఈవిషువత్ యొక్క విశేష మేమనఁగ; — సూర్యుఁడీ 'విషువ'త్ వద్ద నున్నప్పుడు రాత్రింబవళ్ళు సమానపరిమితిగల వగును, వసంతర్తువు ప్రారంభమగును. ఈ విషువన్ బిందువు స్థిరమైనదిగాదు. దీనికి చలనము గలదు. ఉత్తరధ్రువమును, దాని ననుసరించి ఖగోళమధ్యరేఖయు చలింపుచుండుటచే ఈ విషువత్ బిందువుకూడ రాశిచక్రమువెంట సంవత్సరమునకు ౫౦ శెకండులచొప్పున వెనుకవైపునకు నడచుచుండును. ఈవిషువత్ చలనముబట్టి రెండురకముల సంవత్సరము లేర్పడుచున్నవి (౧) సూర్యుఁడేచోటనుండి బయలుదేరెనో, తిరిగి ఆచోటికి వచ్చుటకు పట్టుకాలము — (Sidereal year — యథాస్థానికవత్సరము) (౨) వసంతర్తువు మొదలు తిరిగివసంతర్తువు ప్రారంభమగువఱకు పట్టుకాలము — (అనఁగ) 'విషువత్' నుండి, తిరిగి విషు

వర్షవఱకు పట్టుకాలము. — (Tropical year: వాసంతిక వత్సరము.)




అ: అనునది అశ్వనీనక్షత్ర మనుకొనుము. వి౧ అనునది విషువద్బిందువుయొక్క మొదటిస్థానమనుకొనుము ఈ రెండును ఒకచోట నేయున్నవనుకొనుము సూర్యుడు కూడ అ. వి౧ చోటనేయున్నాఁడనుకొనుము. సూర్యుడు విషువద్బిందువులో నుండుటచే రాత్రింబవళ్లు సమానముగ నుండును; వసంతర్తువు ప్రారంభమగును. ఇదియే సంవత్సరాది యనుకొందము. సూర్యుడు సంవత్సరాదినాఁడు (అ, వి౧) నుండి బయలుదేరి బాణముచే చూపబడినవైపుగఁ దిరుగుచు కొంతకాలమునకు (షుమారు 3౬౬ దినములకు) తిరిగి అ వి౧ అనుచోటికి చేరును. ఇది మొదటి రకము సంవత్సరము (Sidereal year: యథాస్థానిక వత్సరము) ఇఁక రెండవరకపు సం॥వత్సర మేదనగ సూర్యుడు బాణము చూపువైపునకుఁ దిరుగుచుండగ, విషువద్బిందువు వెనుకవైపునకు మెల్లగ జరుగుచుండు నని చెప్పియుంటిమిగద

కనుక సూర్యుఁడు తనసంచారములో విషువద్బిందువును (వి ౨) అనుచోటనే— అనగ మొదటతాను బయలుదేరిన అ వి ౧ చోటికి రాకపూర్వమే, అనగ అది యింకను ౫౦ సెకండులదూరములో నున్నదనగనే కలుసుకొనుచున్నాఁడు. సూర్యుఁడు విషువద్బిందువును వి౨ అనుచోటనే కలుసుకొనుటచేత, తత్క్షణమే, అచ్చటనే, సమరాత్రులును, వసంతర్తువును ప్రారంభమగుచున్నవి. కనుక, మొదట వసంతర్తువు వి౧ వద్ద నుండగ నైనది, ఇప్పుడు వి౨ వద్ద నుండగనే యైనది. కనుక, ఋతువులనుబట్టి చూచినచో, మొదటివసంతమునకును, రెండవ వసంతమునకును మధ్య ౫౦ శెకండుల దూరము భేద మున్నది అనగ, (౨౦ ని. ౨౮ శె) కాలము భేద మున్నది. ఈప్రకారము చూచినచో మొదటిరకపు యథాస్థానికవత్సరమునకును, రెండవ రకపు వాసంతిక వత్సరమునకును, ౨౦. ౨ నిమిషములభేద మున్నది. అనగ, ఋతువులుసంవత్సరమునకు ౨౦. ౨ నిమిషముల కాలము వెనుకఁబడుచుండును. దీనినిబట్టిఋతువులు షుమారు రెండు వేల సంవత్సరములకొక నెలచొప్పున వెనుకఁబడుచుండును. అనగ, నిప్పుడు వసంతర్తువు చైత్ర శుద్ధ పాడ్యమినాఁడు ప్రారంభమైన దనుకొందము. ఇంక రెండు వేలసంవత్సరములకు ఫాల్గుణ శుద్ధపాడ్యమినాఁడే వసంతర్తువు ప్రారంభమగునని తాత్పర్యము. కనుక ఋతువులను రెండు వేలసంవత్సరముల కొకపర్యాయము ఒక నెలచొప్పున వెనుకకు నెట్టుకొనుచుండవలెను. లేనిచో పంచాంగములుతప్పును.

నికికూడ ప్రారంభ మగునని మన మూహించవచ్చును.




సూర్యుడు హిమసంక్రమణమునం దుండగ నూతనసంవత్సరము ప్రారంభమయ్యెడి దని వేదాంగ జ్యోతిషములో చెప్పఁబడియున్నది,

“గవాంఅయనం” మొదలగువార్షికసత్రములుకూడ ఆసమయమందే (హిమసంక్రమణమందే) ప్రారంభము గావలయునని శ్రౌతసూత్రములు పల్కుచున్నవి. అదిగాక, ‘దేవ

కర్మలన్నియు ఉత్తరాయనములోనే జరుగవలయు నని జైమిని మొదలగువారు సూచించియున్నారు, (ఉత్తరాయనమనగ హిమసంక్రమణము మొదలు గ్రీష్మసంక్రమణమువరకు గల కాలమని జ్యోతిషగ్రంథములు పల్కుచున్నవి) దీనినిబట్టి సంవత్సరము, యజ్ఞము, ఉత్తరాయణము యీ మూడును హిమసంక్రమణమువద్దనే ప్రారంభ మగుచున్నట్లు గాన్పించుచున్నది. ఈస్థితి ప్రాచీనకాలమునుండి యున్నదో, లేక తదుపరి వాడుకలోనికివచ్చినదో చూడవలెను. దీనిలోని నిజానిజములను మనమిప్పుడు సూక్ష్మముగ పరిశీలించి చూడవలెను.

వార్షికసత్రముయొక్క మధ్యదినమునకు ‘విషువత్’ దినమని పేరు. ‘విషువత్’దినము సంవత్సరమును రెండుసమభాగములుగ విభజించుచున్నట్లే, యీమధ్యదినముకూడ ఈసత్రమును రెండుసమభాగములుగ విభజించుచున్న దని స్పష్టముగ వర్ణింపఁబడియున్నది. [ఐ. బ్రా IV, 22, తై. బ్రా. I,2, 3, 1 — తాం. బ్రా, IV, 7, 1] కనుక సత్రము (లేక యజ్ఞము) అనగ సంవత్సరమునకు నకలని చెప్పవచ్చును. ‘విషువత్’ అనఁగ సమరాత్రింబగళ్లని అర్థము [Equinox = Equal nights & days] పైనచెప్పినప్రకారము ఆదికాలమున హిమసంక్రమణములోనే సంవత్సరము ప్రారంభమైయుండినయెడల, విషువత్ దినము సంవత్సరము మధ్యమందు వచ్చుట కేవలము అసంభవమగును. ఆరీతిగనే యజ్ఞముయొక్క మధ్యమదినముకూడ విషువత్ దిన మగుట

అసంభవ మగును. కనుక, దీనినిబట్టిసంవత్సరములు న సత్ర ములునుకూడ వసంతవిషువత్తువద్దనే ప్రారంభ మైయుండి యుండవలెను. సంవత్సరముగాని, సత్రముగాని (వసంత) విషువత్తువద్ద ప్రారంభమైనచో శరద్విషువత్తు దినము ఈ రెంటి కిని మధ్యదిన మగును. అప్పుడే పైవర్ణనకు సరియైనసమా ధానము కుదురును.

ఇక ఉత్తరాయణ మనుపదమునకు నిజమైనఅర్థ మేమో విచారించిచూచెదముగాక. దీనికి రెండువిధములుగ అర్థము చెప్పుటకు అవకాశ మున్నది. "దక్షిణపుకొననుండి ఉత్తర ము వైపునకు నడుచుట" అనిగాని, లేక "ఉత్త రార్ధగోళమందు సంచారమొనర్చుట" అనిగానిచెప్పవచ్చును మొదటియర్థము నంగీకరించినచో ఉత్తరాయణము హిమసంక్రమణములో ప్రారంభమగు ననియు, నూతనసంవ త్సరముకూడ అప్పుడే ప్రారంభమగుననియు తాత్పర్యము. ఇక రెండవయర్థము నంగీకరించినచో ఉత్తరాయణమును, దాని ననుసరించి నూతనసంవత్సరమునుకూడ వసంతవిషు వత్తువద్ద ప్రారంభ మగుననియు తాత్పర్యము. ఈ రెంటిలో దేని నంగీకరింపవలెను? వార్షికసత్రముయొక్క మధ్యమ దినమునకు ,,విషువన్, దినమని పేరిడుటచేతను, ఋతువు లలో వసంతర్తువు ప్రథమఋతు వని యంగీకరించుటచేతను, [తై. బ్రా. I, 1, 2, 6— ముఖం వా ఏత దృతూనాం యద్వసన్తః,] అగ్రయనేష్టుల అనగ పాకయాగ స క్రతువులను వసంతశరదృతువులలో నాచరింపవలె నని

విఘించుటచేతను, ఉత్తరాయణ మనుపదమునకు రెండవ యర్థమే యంగీకార్యమని సిద్ధించుచున్నది.

అయినను ఈయంశమునే యింకను సూక్ష్మముగ విచారించి చూచెదముగాక వేదసంహితలయందు ఉత్తర దక్షిణాయనములకుమాఱుగ దేవ, పితృ, యానములు వర్ణింపఁబడియున్నవి. బృహదారణ్యకోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తులందు కూడ వీనిని విపులముగ వర్ణించిరి. దేవయాన మనఁగ దేవతలమార్గ మనియు ఇచ్చట సదా పగ లనియు, కావలసినంత వెలుతురు, అగ్ని యుండుననియు, సూర్యుఁడు ఆఱునెలలు ఉత్తరముగ నుండుననియు వర్ణించిరి. పితృయానమనఁగ పితరులమార్గమనియు, ఇచ్చట సదా రాత్రిగనుండి, చీకటిగను, ధూమావృతముగను ఉండుననియు, ఇచ్చట సూర్యుఁడు దక్షిణముగ నుండుననియు వర్ణించిరి. ఉత్తరాయణమును భగవద్గీతలలో కూడ వర్ణించియుండిరి. ఈవర్ణనలకన్నిటికిని నిజమైన అర్థమేమి? భాష్యకారులందఱును మొదటియర్థమునే (హిమసంక్రమణము మొదలు గ్రీష్మసంక్రమణమువఱకు ననియే) చెప్పిరి. ఈయర్థము ఇటీవలి శాస్త్రజ్ఞుల మతమునకు సమ్మతమేయైనను, ప్రాచీన వేదకాలమునకు మాత్రము సమ్మతముగాఁజాలదు. దీనికిపైప్రమాణము శతపథబ్రాహ్మణము (II, 1-3, 1-3) నుండి చూపెదను. [వసంతో గ్రీష్మోవర్షా । తే దేవా ఋతవః । శరద్ధేమంతః శిశిరస్తే పితరోయ ఏవా పూర్యతేఽర్ధమాస । సదేవా యోఽపక్షీయతే సపితరోఽహరేవ దేవారాత్రిః పితరః పునరహ్నః పూ

హ్ణో దేవా అపరాహ్ణః పితరః........... । సయత్రఉదగా వర్తతే దేవేషు తర్హిభవతి దేవారిస్త్వర్హ్యభిగోపాయత్యథ యత్రదక్షిణావర్తతే పితృషు తర్హిభవతిభవతి పితౄంస్త్వర్హ్యభి గోపాయతి॥]

శతపథబ్రాహ్మణమునందు ఈరీతిని స్పష్టముగ వర్ణన గలదు.

,, వసంతగ్రీష్మవర్ష ఋతువులు దేవఋతువులు; శరత్, హేమంత, శిశిర ఋతువులు పితృఋతువులు. వృద్ధిపొందుపక్షము దేవపక్షము. క్షీణించుపక్షము పితృపక్షము. పగలు దేవతలది; రాత్రి పితరులది, పగటిలో మొదటిభాగము దేవతలది, పగటిలో రెండవభాగము పితరులది, (సూర్యుడు) ఉత్తరమునకు తిరిగినప్పుడు దేవతలలోనుండి వారిని కాపాడుచుండును. దక్షిణమునకు తిరిగినప్పుడు పితరులలోనుండి వారిని కాపాడుచుండును.'' ఈవాక్యములు పూర్తిగ సంశయవిచ్ఛేద మొనర్చుచున్నవి.

కనుక దేవయానమనగ, వసంత, గ్రీష్మ, వర్షర్తువు లని సిద్ధించుచున్నది. కనుక ఉత్తరాయణమనగ వసంతవిషువత్ మొదలు శరద్విషువత్ వరకు నని తాత్పర్యము. సూర్యుడు ఉత్తరార్ధగోళములో సంచార మొనర్చు కాలమునకు ఉత్తరాయణ మనియు, దక్షిణార్ధగోళములో సంచార మొనర్చు కాలమునకు దక్షిణాయనమనియు ఆనికాలమునాటి ప్రాచీన వేదకాలమునాటి యర్థమైయున్నది. కనుక ఉత్తరాయణము, వసంతము, నూతనసంవత్సరము, వార్షికసత్రము —

యివన్నియు ప్రాచీన వేదకాలమున వసంతవిషువన్ వద్దనే ప్రారంభమైనవని సిద్ధించుచున్నది. వర్షర్తువు పూర్తియైన పిమ్మట వచ్చుశరద్విషువద్దినమే సంవత్సరమునందును, సత్రమునందును మధ్యమదినముగ నెన్నికకువచ్చెను

కాని సూర్యుడు హిమసంక్రమణమునందుండగ నూతన సంవత్సరము ప్రారంభమయ్యెడిదని వేదాంగజ్యోతిషములో చెప్పబడి యుండుటకు కారణమేమి? ఈయభిప్రాయమునే శ్రౌతసూత్రములును జైమినియు చెప్పుటకు కారణమేమి? దీని కొక్కటేసమాధానముగలదు ఈమార్పు ఇటీవల జరిగియుండియుండవలెను. ఎప్పుడు జరిగినదో ఖండితముగ చెప్పుటమాత్రము కష్టము. ఏదియెట్లున్నను, వసంతవిషువన్ కృత్తికలలోనికి రాకపూర్వము చాలకాలముక్రిందటనే యీమార్పు జరిగియుండియుండవలెను. (ఏలనన, కృత్తిక యుగములో నున్న భారతకాలమునకుపూర్వమే యీమార్పు జరిగియుండెనని భీష్ములవారిమరణవృత్తాంతమువలన గోచరమగుచున్నది. ఈమార్పు జరిగినప్పటినుండియు సంవత్సరము యొక్కప్రథమభాగమును దెల్పుటకు "ఉత్తరాయణ మను పదము వాడుకలోనికి వచ్చెను (అనగ హిం॥ సం॥ మొదలు గ్రీ. సం॥వరకు) అంతకుపూర్వము దేవయానము దేవలోకము అనుపదములే తప్ప ఉత్తరాయణ మనుపదము లేనే లేదని నాయభిప్రాయము. ఋగ్వేదములో ఉత్తరాయణ మనుపదము అసలు లేనేలేకపోవుటచే నాయభిప్రాయము మఱింతబలపడుచున్నది. ఈమార్పు జరిగినపిమ్మటనే ఉత్త

రాయణమునకు హిమసంక్రమణము మొదలు గ్రీష్మసంక్రమణమువఱకు గలకాలము అను అర్థము వచ్చెను. కనుక ప్రాచీన వేదకాలమునాఁటి యాచారవ్యవహారములనుగూర్చి మాట్లాడుచున్నప్పుడు ఉత్తరాయణపదమునకు మన యీ కాలమునాఁటి యర్థమునే మనస్సునఁ బెట్టుకొనఁగూడదు. ఈయర్థమును మనస్సులో పెట్టుకొని వ్యవహరించినకారణముచేతనే భాస్కరాచార్యులవంటి గొప్పపండితుఁడు సైతము తికమకపడవలసివచ్చెను. ("ఆర్యుల ఉత్తరధ్రువనివాసము" అనుగ్రంథమును చూడుఁడు.) మేరువువద్ద (ఉ. ధ్రు) నున్న దేవతలకు ఉత్తరాయణము పగలనియు, దక్షిణాయనము రాత్రియనియు సంహితాగ్రంథములలో గలదు. సూర్యుఁడు వసంతవిషువత్ వద్దనుండి బయలుదేరి శరద్విషువత్ వద్దకు సంచారముచేయుచున్న ౬ మాసములకాలమందే ఉ. ధ్రు. (మేరువు) వద్దనున్నవారికి పగలగును. ఇదియే దేవతలకు పగలు. అనగ ఉత్తరాయణము, సూర్యుఁడు శరద్విషువత్ నుండి బయలుదేరి ఖగోళరేఖకు దక్షిణభాగమందు సంచారమొనర్చి తిరిగివసంతవిషువన్ వద్దకు వచ్చు ౬ మాసములును ఉ. ధ్రు. (మేరువు) వద్దనున్నవారికి చీకటియగును- అనగ దేవతలకు రాత్రియగును. అనగ, దక్షిణాయనము - కనుక ప్రాచీనకాలమునాఁటి యుత్తరాయణసంజ్ఞకు నేను చెప్పినయర్థమే సరియైనదని సంహితాగ్రంథములు మిక్కిలిబలపఱచుచున్నవి.

ఈరీతిని సంవత్సరాదిదినము వసంతవిషువత్‌నుండిమాఱి హిమసంక్రమణమువద్దకుపోగనే దానిననుసరించియున్న సత్రముల ప్రారంభదివసముకూడ హిమసంక్రమణమునకే మార్చబడెను. అప్పటినుండియు విషువత్‌దినముయొక్క నిజార్థము పోయి, దానికి సత్రముయొక్క మధ్యదినమని అప్రాముఖ్యమగు (Secondary) అర్థము వచ్చెను ఈమార్పు తైత్తిరీయ సంహితాకాలమునాఁటికే జరిగియుండెను.

[కాని, కొన్ని కారణాంతరములచే ఇప్పటికి సుమారు ౧౫౦౦ సం॥లకి్రందట వరాహమిహిరుఁడు వచ్చి సంవత్సరాదిని మరల వసంతవిషువత్‌వద్దకు చేర్చెను. అయినను, ఉత్తరాయణప్రారంభము మాత్రము హిమసంక్రమణమువద్దనే నిలిచిపోయెను. వరాహమిహిరుడు దానినిమాత్రము మార్చలేదు.] కావుననే నర్మదానదికి దక్షిణముననున్న మనమందఱమును నూతనసంవత్సరాదిని ఇప్పుడు వసంతవిషువత్‌వద్దనే ప్రారంభించుచున్నాము. మఱియు, ఉత్తరాయణములో చేయవలసినవని చెప్పబడినకర్మలనన్నిటిని హిమసంక్రమణముతోడనే ప్రారంభించుచున్నాము.

# తృతీయాధ్యాయము

—♦ కృత్తికలు ♦—

మొట్టమొదట ప్రాచీనపుటార్యులు తమనూతన సంవత్సరమును వసంతవిషువత్ వద్ద ప్రారంభించిరనియు, అటు పిమ్మట కొంతకాలమునకు దానిని హిమసంక్రమణమువద్ద కుమార్చిరనియు పైయధ్యాయములో చెప్పియుంటిమి. సంవత్సరాదిని యీప్రకారముమార్చినను నక్షత్రక్రతువు మొదలగు కొన్నిక్రతువులనుమాత్రము విషువత్ వద్దనే ప్రారంభించుచుండెడివారని గర్గుడుబల్కుచున్నాడు.

విషువత్ చలనమువలన ఋతువులు వెనుకబడుచుండుటచే యీమార్పును దెలియబరచుటకు ప్రాచీనపుటార్యులు తమ పంచాంగములలో కూడ తదనుగుణముగ మార్పులనేమైన చేసికొనెడివారో లేదో విచారించి చూచెదముగాక.

విషువత్ యిప్పుడు రేవత్యంతమందున్నదను భావముతో యిప్పటికాలపు పంచాంగములు గుణింపబడుచున్నవి అందుచేతనే నక్షత్రములను అశ్వనీతో ప్రారంభించుచున్నాము. కాని విషువత్ యిప్పుడు రేవతినుండి ౧౯ డిగ్రీలు వెనుకకు నడచినది. ఆ ౪౯౦ సం॥ లో (అనగ, ౧౪౩౦ సంవత్సరములక్రిందట) విషువత్ రేవత్యంతమందుండియుండవచ్చునని 'విట్నీ' పండితుడు చెప్పుచున్నాడు. దీనినిబట్టి విషువత్ బిందువు రాశిచక్రములవెంబడి యెప్పు డేయేనక్షత్రములలోనుండెనో పరిశీలించి చూచెదముగాక.

రాశిచక్రములో ౨౭ నక్షత్రము లున్నవి. రాశిచక్రమును ౨౭ సమభాగములుగ విభజించినచో నొక్కొక్క నక్షత్రప్రమాణము $\frac{౩౬౦}{౨౭}$=౧౩°-౨౦" (౧౩ డిగ్రీల ౨౦ నిమిషములగును.) అనగ, గణితశాస్త్రప్రకారము ఒకనక్షత్రమునకును, మరియొక నక్షత్రమునకును మధ్య దూరము ౧౩ డిగ్రీల ౨౦ నిమిషములై యుండవలెను. కాని, ఆకాశమును పరీక్షించిచూచినచో, యీనక్షత్రము లీరీతిగ సరిసమానమగు దూరములలో లేవు. కొన్ని దగ్గరగను, మరికొన్ని దూరముగను నున్నవి. ప్రాచీనపుటార్యులు సూర్యునిస్థలమును నిర్దేశించుటకై ప్రతియుదయమునను సూర్యునకు సమీపముననున్న నక్షత్రమును గుర్తించుకొనెడివారని పైయధ్యాయములో ప్రమాణసహితముగ దెలిపియుంటిమి. కనుక, గణితశాస్త్రప్రకారము వచ్చు నక్షత్ర ప్రమాణమునకును, కేవల మాకాశమందు మనకంటికగపడు నక్షత్రప్రమాణమునకును తప్పక భేదముండితీరును వేదవాక్యములతాత్పర్యమును నిర్ణయించునప్పు డీభేదమును ముందు మనస్సునందు బాగుగ గుర్తించుకొనవలెను. ప్రాచీనపుటార్యులు ఆకాశమందు తమకండ్లకు ప్రత్యక్షముగ గాన్పించు నక్షత్రప్రమాణములనే ఆధారముగ గైకొనిరిగాని, యిట్టిగణితశాస్త్రప్రకారము సరిసమానముగవచ్చు ౧౩°-౨౦"ల ప్రమాణమును గైకొనలేదని మనము బాగుగ గుర్తించుకొనవలెను. (ముఖ్యముగ యీయధ్యాయమందీయంశమును జ్ఞాపకముంచుకొనవలెను.) ప్రత్యక్షనక్షత్రమే యాధారముగాని, కృత్రి

మమగుగణితవిభాగము ఆధారముగాదు. దీని ప్రయోజనము ముందు దెలియనగును. ఈ ౧౩°-౨౦" నక్షత్రప్రమాణమునకే "అంశ" మని పేరిడుదుము. ఒక్కొక్కనక్షత్రమునకు ఒక్కొక్క అంశ.

"సూర్యుడు కృత్తికనక్షత్రములో నున్నాడ"ని వేదములో నొకవాక్యమున్నదనుకొనుము. అనగ అర్థమేమి? సూర్యుడు ఆకాశములో ప్రత్యక్షముగ కృత్తికనక్షత్రముదగ్గరగ నున్నాడనియే అర్థమగునుగాని గణితశాస్త్రప్రకారము కృత్తికలకై కృత్రిమముగ నియమింపబడిన ౧౩౦, ౨౦" ల పరిమితిగలరాశి చక్రభాగముయొక్క కొన (౩) యందున్నాడని అర్థముకా నేరదు.

విషువత్ చలనమువలన హిమసంక్రమణమునకును, తక్కిన ప్రధానస్థానములకునుకూడ చలనము తప్పకగలిగితీరును. విషువత్ చలించినట్లు ప్రాచీనగ్రంథములలో నెచ్చటనైన గన్పట్టినప్పుడు, తక్కినస్థానములుకూడ, తదనుగుణ్యముగ చలించినట్లు గన్పట్టుచున్నదా లేదాయని విచారించిచూడవలెను. నేనీగ్రంథము నందవలంబింపబోవు పద్ధతియిదియే.

ఇక విషువత్ ఒకప్పుడు కృత్తికలలోనున్నట్లు చెప్పు ప్రమాణవాక్యములనుగూర్చి విమర్శింతము.

1 వరాహమిహిరునికాలములో విషువత్ రేవత్యంతమందుండెను. క్రీ. సం. పునర్వసులోనుండెను. వరాహమిహిరుడు తనకుపూర్వకాలమందున్న గ్రంథములలో నుదహరింపబడిన

ఖగోళస్థితిగతుల నిట్లువర్ణించియున్నాడు. 'సూర్యుడు ఆశ్లేషార్ధమునుండి తిరిగినప్పుడు, అయనముసరిగనుండెను. కాని యిప్పుడది పునర్వసునుండియే జరుగుచున్నది. [ఆశ్లేషార్ధాదాసీద్యాదానివృత్తిః కిలోష్ణకిరణస్య యుక్తమయనంతదాసీత్సాంప్రతమయ నంపునర్వసుతః]. ఇట్లే బృహత్సంహితలోకూడ పైచెప్పినరీతిని క్రీ. సం. కు రెండుస్థానములు వర్ణింపబడినవి ఈరెంటిలో నేదిసరియైనదో పాఠకులే ప్రత్యక్షముగ ఆకాశమును పరీక్షించిచూచి నిర్ణయించుకొనవలసినదని గ్రంథకారుడు చెప్పియున్నాడు (ఆశ్లేషార్ధా ద్దక్షిణముత్తరమయనం రవేర్ధనిష్ఠాద్యమ్ నూనంకదాచి దాసీద్యేనోక్తం పూర్వశాస్త్రేషు॥ సాంప్రతమయనం సవితుః కర్కటకాద్యం మృగాదితశ్చాన్యత్ । ఉక్తాభావో వికృతిః ప్రత్యక్షపరీక్షణైర్వ్యక్తిః ॥

గర్గ:— "యదామావస్య శుక్లస్య ప్రతిపద్యుత్తరాయణం । సహోదయంశ్రవిష్ఠాభిః సోమార్కౌ ప్రతిపద్యతః ॥ —

భట్టోపాధ్యాయ:— శ్రవిష్ఠాద్యాత్పౌష్ణార్ధం చరతః శిశిరః ॥—

అమర I 4 13:- — ద్వౌద్వౌమాఘాది మాసౌస్యాదృతుస్తైరయనంత్రిభిః॥—

హి॥ సం॥ ధనిష్ఠాంశాద్యమందును, గ్రీష్మసంక్రమణము ఆశ్లేషార్ధమునందును గలవని చెప్పుపురాతనగ్రంథములు వరాహమిహిరునికాలములో[illegible]నుండెనని దీనివలన స్పష్టమగుచున్నది. [గర్గః పరాశర:— యదామావస్య శుక్లస్యప్రతిద్యు

త్తరాయణం । సహోదయం శ్రవిష్ఠాభిః సోమార్కౌ ప్రతిపద్యతః॥—

శ్రవిష్ఠాద్యాత్పౌ ష్ణార్ధంచరతః శిశిరః॥—

పైనుదహరించిన దానినిబట్టి సూర్యుడు హిమసంక్రమణముపద్దనుండగనే నూతనసంవత్సరము ప్రారంభమైనచో మాఖమాసమే సంవత్సరాది యగునని తేలుచున్నది.

[పౌర్ణమినాడు చంద్రుడుసూర్యునకు ౧౮౦ డిగ్రీలదూరములో నుండును. పౌర్ణమినాడు చంద్రు డేనక్షత్రమువద్ద నుండునో, ఆ నెలకు ఆనక్షత్రముపే రేవచ్చును. సూర్యుడు ధనిష్టలో (హిమసంక్రమణమువద్ద) నున్నప్పుడు చంద్రుడు (ఆనెలలో పౌర్ణమినాడు) ఆశ్లేషార్ధమందుగాని మఖయందు గాని యుండును కనుక ఆమాసము మాఖమాసమగును.] కనుక సూర్యుడు ధనిష్టలో— హిమసంక్రమణమువద్ద నున్నప్పుడది మాఖమాసము. కాబట్టి నూతనసంవత్సరాది మాఖమాసములో వచ్చును. వేయేల? పూర్వమొకప్పుడు నూతనసంవత్సరమునుమాఖ మాసముతో ప్రారంభించినట్లనేక నిదర్శనములున్నవి. ఋతువనగ రెండుమాసములనియు, ఋతువులు మాఖమాసముతో ప్రారంభమయ్యెడివనియు అమరసింహుడు చెప్పుచున్నాడు. [అమర. I, 4, 13:— ద్వాద్వామావాదిమాసౌ స్యాదృతుస్తైరయనంత్రిభిః॥—

సుశ్రుత, వాగ్భటములను వైద్యగ్రంధములుకూడ యీ తాత్పర్యమునే చెప్పుచున్నవి. [సుశ్రుత I 6, వాగ్భట. (అష్టాంగహృదయ: సూత్రస్థానము III, 2)

అంపశయ్యయందున్న భీష్మాచార్యులవారు ఉత్తరాయణముకొరకు (సూర్యుడు హిమసంక్రమణమునుండి ఉత్తరమునకు తిరుగుటకొరకు) వేచియుండెననియు, అప్పుడు ఉత్తరాయణము మాఖశుద్ధమందువచ్చెననియు మహాభారతము ఆనుశాసనపర్వములోనున్నది. దీనినిబట్టి ఆకాలములో హిమసంక్రమణము ధనిష్ఠాంశాద్యమందు వచ్చెననియుస్పష్టమగుచున్నది వేదాంగజ్యోతిషములో చెప్పినదానికిది సరిపోవుచున్నది.

వసంతవిషువత్ రేవత్యంతమం దున్నప్పటికాలమునకంటె పూర్వకాలమందొకప్పుడు నూతనసంవత్సరమును మాఖమాసములో హిమసంక్రమణమునుండి ప్రారంభించెడివారనియు. అప్పుడు వసంతవిషువత్ భరణియొక్క చతుర్థపాదమందో లేక కృత్తికయొక్క ప్రథమపాదమందో యుండెననియు సిద్ధించుచున్నది, ఈయంశమే వేదాంగజ్యోతిషములోకూడా వర్ణింపబడినది.

వేదాంగజ్యోతిషమనునది వేదకాలమునాటి జ్యోతిషగ్రంథము. దీనిలో కొన్నివాక్యములిప్పటికిని బోధపడకున్నవి. కాని కొన్నిప్రధానాంశములను మాత్రము దీనినుండి గ్రహింపవచ్చును. అప్పటిఖగోళస్థితినిగూర్చి వేదాంగజ్యోతిషములో నిట్లువర్ణింపబడియున్నది.

(౧) హిమసంక్రమణము శ్రవిష్ఠాంశాద్యమందున్నది.

(౨) వసంతవిషువత్ భరణి పది డిగ్రీలలో (చతుర్థపాద ములో) నున్నది.

(3) గ్రీష్మసంక్రమణము ఆశ్లేషార్థమందున్నది.

(౪) శరద్విషువత్ విశాఖానక్షత్రము ౧౩౼ ౨౦'' లలో నున్నది.

సూర్యచంద్రులిరువురును ధనిష్ఠాంశార్ధమందున్నప్పుడు హిమసంక్రమణములో నూతనసంవత్సరాది ప్రారంభమయ్యెను. ఉత్తరాయణముకూడ అప్పుడే ప్రారంభమాయెను. [ ప్రమాణం; వేదాంగజ్యోతిషము: ౫ న. శ్లో. ప్రపద్యేతే శ్రవిష్ఠాశౌ సూర్యాచంద్రమసావుదక్ సార్పార్ధే దక్షిణార్కస్తుమాన శ్రావణయోః సదా ] అదిగాక, ఒక్కొక్కనక్షత్రమునకు ఒక్కొక్క అధిష్ఠానదేవతకలదట ఈదేవతలను లెక్కించుటలో మొట్టమొదట కృత్తికానక్షత్రమునకధిష్ఠానదేవతయగు అగ్నితో ప్రారంభించెడివారట. [ వే జ్యో. ౨౫ శ్లో అగ్నిః ప్రజాపతిః సోమో etc] పైనవర్ణితమైన ఖగోళస్థితి క్రీ. పూ. ౧౨౬౯ సం ల క్రిందటనో లేక ౧౧౮౧ సంవత్సరముల క్రిందటనో యుండియుండవలెనని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు గణితశాస్త్రరీత్యా నిర్ణయించియున్నారు. వేదాంగజ్యోతిషములోని యంశములను బలపరచుచు, వేదకాలము సింకను వెనుకకు తీసికొనిపోవు ప్రమాణములు పెక్కులుగలవు. నక్షత్రగణనమును కృత్తికలతో ప్రారంభించు వాక్యములనేకములు తై॥ సం॥, తై॥ బ్రా॥ మొదలగు

ప్రాచీనగ్రంథములందు గలవు [తై. సం. IV, 4, 10, తై. బ్రా. III, 1-1-6; I, 5, 1, 2,] "కృత్తికలు నక్షత్రములకు ముఖమని తై॥ బ్రా॥ I, 1, 21 లో స్పష్టముగనున్నది. [కృత్తికాస్వాగ్నిమాదధీత్ । ముఖం వా ఏతన్నక్షత్రాణాం యత్కృత్తికాః.] ఋతువులకు వసంతర్తువు "ముఖ"మైనట్లుగానే, నక్షత్రములకు కృత్తికలు ముఖమైయున్నవి. నక్షత్రములలో కృత్తికలకు ప్రథమస్థాన మిచ్చుటకు అర్థమేమి? పూర్వము నూతనసంవత్సరమును వసంతవిషువత్ వద్దగాని హి॥ సం॥ వద్దగాని ప్రారంభించెడివారని చెప్పితిమి. అయితే యీకృత్తికలు యీరెండుస్థానములలో నెచ్చటనుండెడివి? లేక, మరియింకెచ్చటనైన నుండెడివా? కృత్తికలు గ్రీ॥ సం॥ వద్ద వున్నవని చెప్పినచో తై॥ సం॥ క్రీ॥ పూ॥ ౨౨ వేలసంవత్సరములక్రిందట పుట్టినదని చెప్పవలెను. ఇది అసంభవము దీనిని బలపరుచు ఆధారములేమియులేవు. ఆరీతిగనే కృత్తికలు శరద్విషువత్‌లో వున్నవని చెప్పినచో తై॥ సం॥ క్రీ॥ పూ॥ ౧౫॥ వేలసం॥ ల క్రిందట పుట్టినదని చెప్పవలెను. ఇదియు అసంభవమే. ఇదిగాక, యిక హి॥ సం॥ ను వసంతవిషువమును మిగిలినవి. వసంతవిషువత్ భరణి చతుర్థపాదములో నున్నదను వేదాంగజ్యోతిషపు వర్ణనఁబట్టి చూడఁగ కృత్తికలు తైత్తిరీయ సంహితాకాలమునాటికి వసంతవిషువత్‌లోనున్నవని నిర్ణయించుట యెక్కువ యుక్తముగనుండును.

కాని, మన మింతటితోనే తృప్తిజెందియుండ నక్కరలేదు. దీనిని బలపరుచుట కింకను ప్రమాణములు గలవు తైత్తిరీ

య బ్రాహ్మణము I, 5, 2, 7 లో [దేవగృహావై నక్షత్రా ణి। ..............। కృత్తికాః ప్రథమం। విశాఖే ఉత్తమం। తాని దేవనక్షత్రాణి। అనురాధాః ప్రథమం। అపభరణీరుత్తమం తాని యమనక్షత్రాణి యాని దేవనక్షత్రాణి తాని దక్షిణేన పరియంతి। యాని యమనక్షత్రాణి తాన్యుత్తరేణ॥

"నక్షత్రములు దేవగృహములు...దేవనక్షత్రములు కృత్తికలతో ప్రారంభమై, విశాఖతో అంతమొందుచున్నవి. యమనక్షత్రములు అనూరాధతో ప్రారంభమై అపభరణితో అంతమొందుచున్నవి." ఈ విభాగము కూడ యిదివరలో వర్ణింపబడిన 'దేవపితృయానములను బోలియున్నది. సూర్యుడు ఉత్తరార్ధగోళమందు వసంత, గ్రీష్మ, వర్షర్తువులలో సంచరించుచున్నపుడు దేవతలను రక్షించుచున్నాడని శతపథ బ్రాహ్మణములో స్పష్టముగ నున్నది. కనుక ఉత్తరార్ధగోళము [అనగ వసంతవిషువత్తు మొదలు శరద్విషువత్తు వరకు] దేవతలకును, దక్షిణార్ధగోళము పితరులకును ప్రత్యేకింపబడినట్లు గాన్పించుచున్నది. కనుక ఉత్తరార్ధగోళమందలి నక్షత్రములు 'దేవనక్షత్రములనియు, దక్షిణార్ధగోళమందలి నక్షత్రములు యమనక్షత్రములనియు వర్ణింపబడినవి. ఈరీతిగ విభజించినప్పుడు కృత్తికలు ఉత్తరార్ధగోళములో ప్రథమ నక్షత్రములుగ - నుండుననుమాట స్పష్టము. (అనగ వసంతవిషువత్తులో నుండుననుమాట స్పష్టము) దానికి వెనుకనున్న 'అప–భరణి' దక్షిణార్ధ గోళములోనికి పోవునుగద.

దేవనక్షత్రములు దక్షిణపువైపునకు తిరుగుచున్నవనియు యమనక్షత్రములు ఉత్తరపువైపునకు తిరుగుచున్నవనియు (పరియాంతి) తైత్తిరీయ సంహిత వర్తమానకాల సూచకముగ వర్ణించినది. కనుక, యిది ప్రత్యక్షముగ ఆకాశమువంక జూచి చెప్పినమాటయని యూహింపవలసి వచ్చుచున్నది. దేవనక్షత్రములు దక్షిణపువైపుగ తిరుగుచున్నవనగ అర్థమేమి? అనగ వసంతవిషువత్ నుండి గ్రీష్మసంక్రమణము మీదుగ శరద్విషువత్ వరకు— దక్షిణార్ధగోళము ప్రారంభమగు వైపునకు తిరుగుచున్నవన్నమాట. అశ్లేషయమనక్షత్రములు శరద్విషువత్ నుండి హిమసంక్రమణము మీదుగ ఉత్తరముఖముగ— ఉత్తరార్ధగోళము ప్రారంభమగు వైపునకు తిరుగుచున్నవన్నమాట. ఈప్రమాణములనుబట్టి తైత్తిరీయ సంహితాకాలమునాటికి వసంతవిషువత్ కృత్తికలలోనున్నదని స్పష్టమగుచున్నది.

ఇదిగాక తైత్తిరీయ సంహిత VII, 4, 8 లోనున్న వాక్యములనుబట్టి పైసిద్ధాంతము మరింతబలమగుచున్నది. సంవత్సరముపొడుగునను చేయవలసిన "గవాం అయనం" వంటి సత్రములను (అనగ యజ్ఞములను) ప్రారంభించుట కేసమయం చిదనమో యాక్రింది వాక్యములలో చర్చచేయబడియున్నది.

తైత్తిరీయ సంహితా VII, 4, 8.

సంవత్సరాయ దీక్షిష్యమాణా ఏకాష్టకాయాం। దీక్షేరన్నేషావై సంవత్సరస్య పత్నీ యదేకాష్టకైతస్యాంవా ఏష ఏ

తా రాత్రింవసతి సాకూ దేవ సంవత్సరమారమ్య దీక్షంత

ఆర్తం వా ఏతే సంవత్సర స్యాభిదీక్షంతేయ ఏకాష్టకా

యాందీక్షంతేం తనామానాప్రుతూ భవతోవ్య స్తంవాఏతే

సంవత్సరస్యాభిదీక్షంతే యఏకాష్టకాయాం దీక్షంతేత నా

మానావృతూ భవతః ఫల్గునీ పూర్ణమాసే దీక్షేరన్ముఖం వా

ఏతత్ సంవత్సరస్య యత్ఫల్గునీ పూర్ణమాసో ముఖత ఏవ

సంవత్సర మారభ్య దీక్షంతే తస్యైకైవనిర్యా యత్సామ్మే

ధ్యే విషూవాన్ త్సంపద్యతే చిత్రాపూర్ణమాసే దీక్షేరన్ము

ఖం వా ఏతత్సంవత్సరస్య యచ్చిత్రాపూర్ణమాసో ముఖత

ఏవ సంవత్సరమారభ్య దీక్షంతే తస్యనకాచన నిర్యాభవతి

చతుర్హే పురస్తాత్ పౌర్ణమాస్యై దీక్షేరన్తే షామేకా

కాయాంక్రియః సంపద్యతే తేనైకాష్టకాం నఛం బట్కు

ర్వంతి తేషాం పూర్వపక్షేసుత్యా సంపద్యతే పూర్వపక్షం

మానాఅభిసంపద్యంతే తే పూర్వపక్షఉత్తిష్ఠంతి తానుత్తి

ష్ఠత ఓషధయో వనస్పతయోనూత్తిష్ఠంతి తాన్ కల్యాణీ

కీర్తిరనూత్తిష్ఠత్యరాత్సురిమే యజమానా ఇతి తదనుసర్వేరా
ధ్నువంతి॥

తండ్య బ్రాహ్మణ్యము : V: 9.

ఏకాష్టకాయాందీక్షేరన్ ॥

ఏషావై సంవత్సరస్య పత్నీయ దేకాష్టకైతస్యాం వాఏతాం
రాత్రిం వసతిసాక్షా దేవతత్సంవత్సర మారభ్యదీక్షంతే ॥౨॥
తస్యసానిర్యాం యదపోఽనాభినందంతోఽ భ్యవయంతి
॥3॥

విచ్ఛిన్నం వా ఏతే సంవత్సరస్యాభిదీక్షంతే య ఏకాష్ట
కాయాం దీక్షంతేఽత నామానావృతూభవతః ॥౪॥
ఆర్తం వా ఏతే సంవత్సరస్యాభిదీక్షంతే యేఽతనా
మానావృతూ అభిదీక్షంతే ॥౫॥
తస్యాదేకాష్టకాయాం న దీక్ష్యమ్ ॥౬॥
ఫాల్గునేదీక్షేరన్ ॥౭॥
ముఖం వా ఏతత్సంవత్సరస్యయత్ఫాల్గునీ ముఖత ఏవ
తత్ సంవత్సరమారభ్యదీక్షంతే ॥౮॥
తస్యసానిర్యాయత్సమ్మేఘే విషువాన్ సంపద్యతే ॥౯॥
చిత్రాపూర్ణమాసే దీక్షేరన్ ॥౧౦॥

చతుర్వాఏతత్ సంవత్సరస్య యచ్చిత్రాపూర్ణమాసో ముఖతో వైచతుర్మ్ముఖత ఏవతత్ సంవత్సరమారభ్యదీక్షంతే తస్యననిర్యాస్తి ॥౧౧॥

చతురహే పురస్తాత్ పౌర్ణమాస్యా దీక్షేరన్ ॥౧౨॥

తేషామేకాష్టకాయాంక్రియః సంపద్యతే తేనైకాష్టకాం నసంవట్ కుర్వంతి ॥౧౩॥

ఏషాం పూర్వపక్షేసుత్యా సంపద్యతే పూర్వపక్షే మాసాః సంతిష్ఠమానాయంతి పూర్వపక్ష ఉత్తిష్ఠంతి తాను త్తిష్ఠతః పశవః ఓషధయోఽనూత్తిష్ఠంతి తాం కల్యాణీవాగభివదత్యరాత్సురిమేసత్రిణ ఇతి తే రాధ్నువంతి ॥౧౪॥

ఈపైవాక్యముల భావమిట్లువ్రాయుచున్నాము. [సంవత్సరము=యజ్ఞము] "యజ్ఞముచేయదలచుకొనువారు "ఏకాష్ట దినమందేదీక్షితులుగావలెను. [ఏకాష్టకమనగ మాఘబహుళాష్టమి] ఏకాష్టకము సంవత్సరమునకు పత్ని. "సంవత్సరము" ఆరాత్రి ఆమెతోనుండును. కనుక ఏకాష్టమునాడు దీక్షితులైనవారు కొంచెము యించుమించుగ సంవత్సరారంభముననే దీక్షితులైనట్లెంచుకొనవచ్చును. (కాని) అట్లీయే కాష్టమునాడు దీక్షితులైనవారు "ఆర్త" దినములలో దీక్షితులగుచున్నారు. ఇది చిట్టచివర నుదహరింపబడిన ఋతువు (అదిగాక) ఏకాష్టమునాడు దీక్షితులైనవారు "వ్యస్త" కాలమునందు దీక్షితులగుచున్నారు. ఇదిచిట్టచివర నుదహరింపబడిన ఋతువు. ఫాల్గుణపౌర్ణమినాడు దీక్షితులుగావలెను.

ఫాల్గుణపౌర్ణమి సంవత్సరమునకు ముఖమైయున్నది. (అట్లయి నచో) వారు సంవత్సరముఖమునందే దీక్షితులైనవారయ్యె దరు. కాని దీనిలో నొకలోపమున్నది. ఏమనగ, విషువత్ దినము (యజ్ఞముయొక్క మధ్యదినము) వర్షములలో పడి పోవును. చైత్రపౌర్ణమినాడు వారుదీక్షితులు గావచ్చును. చైత్రపౌర్ణమి సంవత్సరమునకు ముఖమైయున్నది. (అట్లయి నచో) వారుసంవత్సరముఖమునందే దీక్షితులైనవారయ్యెదరు. దీనిలో లోపమేమియు లేదు. (కాని) పౌర్ణమికి (మాఖపౌర్ణ మికి) నాలుగురోజులు ముందుగనే దీక్షితులుగావలెను. (అ ట్లయినచో) వారిసోమ "క్రియ"ము ఏకాష్టక దినమందు జరుగగలదు ఇందువలన, ఏకాష్టమును నిష్ప్రయోజనమును చేయనివారగుదురు. వారియొక్క "సుత్య"ము (అనగ, సోమ రసమునుపిండి తీయుపని) పూర్వ (శుక్ల) పక్షమందే జరు గును. వారిమాస యజ్ఞములుకూడశుక్లపక్షమందే జరుగును. వారుతమ (మాస) యజ్ఞములను పూర్తిచేసి శుక్లపక్షమందే లేవగలరు. వీరులేవగనే, వీరితోబాటు ఓషధులును, వనస్ప తులును కూడ లేచును. అటుపిమ్మట వీరికికల్యాణము జరిగినద నుకీర్తికూడప్రబలును. అటుపై, అందరికిని కల్యాణమగును,

యజ్ఞము చేయదలచు కొన్నవారు నూతనసంవత్సర మిం కను కొలదిదినములకు ప్రారంభమగు ననగనే దీక్షితులు కా వలసియున్నారు. ఏకాష్టము (అనగ మాఖబహుళాష్టమి) చాలముఖ్యమైనదినము దీనినెట్లైనను యజ్ఞదీక్షకు ప్రారంభ దినముగ చేయవలయునని మనవారెంతయో యాతురపడు

చుండినట్లు పైవాక్యములనుబట్టి గన్పట్టుచున్నది. కాని దీనికి ముఖ్యముగ మూడు అభ్యంతరములు గలిగెను. ఏమనగ ఒకటి [౧] ఈఏకాష్టము "ఆర్త" దినములలో [అనగ, శబరుని వ్యాఖ్య ప్రకారము—అతి చలికాలములో] పడిపోయెను; లేక శాయన వ్యాఖ్య ప్రకారము—పాతసంవత్సరము నశించిపోయి క్రొత్త సంవత్సరమువచ్చిన తరువాతి దినములలో పడిపోయెను, ఇక రెండవ యభ్యంతర మేమనగ:— ఆఏకాష్టదినము చిట్టచివరి ఋతువులో [అనగ శిశిరఋతువులో—అతిచలి కాలములో] పడిపోయెను. ఈ రెండభ్యంతరములును ఒకటే; ఇవియంత ముఖ్యమైనవికావు. ఇకమూడవ యభ్యంతర మేమనగ:— ఈ యేకాష్టదినము "వ్యష్ట" కాలములో [అనగ, సూర్యుడు హిమసంక్రమణమునుండి తిరిగిపోయిన తరువాత కాలములో] పడిపోయెను. కనుక, ముఖ్యముగ యీ మూడవ యభ్యంతరమును తొలగించుకొనుటకై మాఘ పౌర్ణమి కింకను నాలుగురోజులు ముందుగనే [మాఘ శుద్ధ యేకాదశినాడే] యజ్ఞదీక్షను బూనవలెనని నిశ్చయించిరి. అట్లయినచో; సూర్యుడు హిమసంక్రమణమునుండి ఉత్తరమునకు తిరుగక పూర్వమే యజ్ఞదీక్షను బూనినట్లగును. [నూతన సంవత్సరము ప్రారంభము కాకపూర్వమే దీక్షితుడయి యుండవలెనని పైన చెప్పియుంటిమిగద] అట్లయినచో సోమరసక్రయము ఏకాష్టమునాడు [అనగ, దీక్షితుడైన ౧౨ వ రోజున] జరుగును గనుక యీ యేకాష్టమును యేదో యొక విధముగ వినియోగించుకొన్న వారగుదురు.

ఈ వాక్యములనుబడి మనము గ్రహింపవలసిన యంశ ములుకొన్ని గలవు. అవేవనగ: —

(౧) తై॥ సం॥ కాలములో హిమసంక్రమణము మాఘ శు ౧౧ కిని మాఘ బ౹ కిని మధ్య వచ్చెడిదని స్పష్టమగుచు న్నది. అనగ మాఘశుద్ధ పౌర్ణమినాడే వచ్చెడిదని నిశ్చ యింపవచ్చును.

(౨) ఆదినమే నూతనసంవత్సరాది యనికూడ స్పష్టము కాగలదు.

[3] ఫాల్గుణ, చైత్ర పౌర్ణమీలుకూడ సంవత్సరారంభ ములేయని పైవాక్యములోనున్నది. సంవత్సరములో మూడు సంవత్సరాదులుండజాలవు. కనుక, యీరెండును తత్పూర్వ యుగములలోని సంవత్సరాదులను సూచించుచున్నవని గ్ర హింపవలెను. దీనినిగూర్చి రాబోవు అధ్యాయములో చర్చించెదము.

[౪] ఫాల్గుణ పౌర్ణమినాడు దీక్షగైకొన్నచో విషు వత్,-అనగ యజ్ఞమధ్యదినము— వర్షములలో పడిపోవునని చెప్పబడినది. దీనివిబట్టి విషువత్ అను పదముయొక్క నిజార్థము మారిపోయి, కేవలము యజ్ఞమధ్యదినమని మా త్రము అర్థమువచ్చినదని గ్రహింపవలెను.

ఈతై॥ సం॥ వాక్యమువలన హిమసంక్రమణము ఆకాల మున మాఘశుద్ధపౌర్ణమినాడు జరిగెడిదని తెలియుచున్నది. కనుక, వసంతవిషువత్ కృత్తికలలో నున్నదని ఋజువగుచు

న్నది. తై॥ సం॥ కాలమున విషువత్ కృత్తికలలో నున్నదని తెలుపుటకు మనకిప్పటికి షుమారు ౬ ప్రమాణములు దొరికినవి.

(౧) వేదాంగజ్యోతిషములోని వర్ణనము; వరాహమిహిరుని వాక్యములు—

(౨) తై॥ సం॥; తై॥ బ్రా॥ లలో వర్ణితమైన నక్షత్రాధిష్ఠాన దేవతల క్రమము.

(3) కృత్తికలు నక్షత్రములకు 'ముఖ' మని చెప్పు తై॥ బ్రా॥ లోని ప్రత్యక్షవాక్యము.

[౪] కృత్తికలు దేవనక్షత్రములలో ప్రథమనక్షత్రములని చెప్పు ప్రత్యక్షవాక్యము.

[౫] హిమసంక్రమణము మాఖశుద్ధపౌర్ణమినాడు జరిగెడిదని చెప్పు పైవాక్యము. —[తై॥ సం॥ VII, 4,8]

[౬] మఖానక్షత్రమునకు పితరులు అధిష్ఠానదేవతలని తై॥ సం॥ IV 4, 10, 1, లో చెప్పబడియున్నది.— అనగ, కృత్తికలు విషువత్ యొద్దనున్నప్పుడు, మఖానక్షత్రము గ్రీష్మసంక్రమణములో నుండును. ఈ గ్రీష్మసంక్రమణము వద్దనే (యిప్పటి) దక్షిణాయనము— లేక పితృయానము— ప్రారంభమగును. కనుక మఖానక్షత్రమునకు పితరులధిష్ఠాన దేవతలనుట సమంజసమే.

దీనినిబట్టి తై॥ సం॥ కాలమును నిర్ణయించుదము. [కృత్తికలనగ ఆకాశమందు మనకు ప్రత్యక్షముగ గాన్పించు కృత్తికా నక్షత్రములగుంపే యని యెరుంగ వలెను— అంతియే

గాని, గణితశాస్త్రరీత్యా నిర్ణయింపబడిన ౧౩°—౨౦'ల అంశముయొక్క ఆదిబిందువుగాదని గుర్తించు కొనవలెను.] ఈ ఆదిబిందువునకును, నక్షత్రముల గుంపునకును ౧౦°—౫౦'—ల దూరమున్నదని సూర్యసిద్ధాంతము [VIII, 2, 9] చెప్పుచున్నది. ఈప్రకారము గుణించినచో త్రై॥ సం॥ కాలము క్రీస్తుకు పూర్వము ౨౩౫౦ సంవత్సరము లగునని "విట్నీ' పండితుడు తెల్పెను.

కాని, కృత్తికలనగ కృత్తి కాంశముయొక్క ఆదిబిందువే యని యూహించి, బెంట్లీపండితుడు విషువర్ణ నుం౧౦°—౫౦' అనగ షుమారు ౧౧ డిగ్రీలువెనుకకు నెట్టెను. ఈలెక్క ప్రకారము త్రై॥ సం॥ కాలము క్రీస్తుకు పూర్వము ౧౨౮౬ సంవత్సరములగునని బెంట్లీ గుణించెను. కాని యీబెంట్లీ పండితుని యూహ సరిగాదని క్రిందటి అధ్యాయములోనే దెలిపియుంటిమి ఏలననగ:— ఖగోళమందు హిమసంక్రమణము వంటి కృత్రిమ బిందువును గుర్తించుకొనగల శక్తి క్రీ॥ పూ॥ ౧౨౦౦ సంవత్సరములనాడు భారతీయులకు లేదనిపాశ్చాత్య పండితులు ఆక్షేపించిరి. ఇప్పుడుతమ వాదన కనుకూలముగ నున్నదన యూహతో— [వేదకాలమును తగ్గించుటకు వీలుగనున్నదను యూహతో] కృత్రిమములేనైన నక్షత్రాంశ విభాగములను క్రీ॥ పూ॥ ౧౫వందల సంవత్సరములనాడు భారతీయు లెరుంగుదురని యేమొగము పెట్టుకొని యీపాశ్చాత్య పండితులు చెప్పుచున్నారు.

కాని, బెంట్లీగారింకొక గొప్పయూహ జేయుచున్నారు. “విశాఖా”, నక్షత్రమునకు ఆపే రెట్లువచ్చినది? విశాఖ అనగ రెండుశాఖలు గలది. వసంతవిషువత్ కృత్తికాంశపు ప్రథమబిందువువద్ద నున్నచో, శరద్విషువత్ సరిగ విశాఖాంశముయొక్క మధ్యభాగమందుండును, అనగ, విశాఖలో సగము భాగము ఉత్తరార్థ గోళమందును, మరియొక సగము దక్షిణార్థగోళమందును పడును. ఈప్రకారము విశాఖానక్షత్రము సరిసమానమైన రెండుభాగములుగ చీల్పబడినదనియు, దీనినిబట్టి వసంతవిషువత్ కృత్తికాంశపు ప్రథమ బిందువు వద్దనే యున్నదగాని, కృత్తికానక్షత్రముల గుంపులో లేదనియు బెంట్లీగారు తలంచుచున్నారు, ఇది చాల తెలివియైన యూహయనుట కేమియుసందియము లేదు— కాని, దీనికి వేదమం దెచ్చటను ఆధారములేకపోగా తై॥ సం॥ వాక్యముల కిది ప్రత్యక్షవిరుద్ధముగ నున్నదని నిరూపించెదను.

తై॥ సం॥ కాలములో హి॥ సం॥ మాఘ శుద్ధ పౌర్ణమి నాడు జరిగెనని పైనచెప్పితిమి. కాని, వేదాంగజ్యోతిష కాలమునాటి కది మాఘశుద్ధపాడ్యమినాడే జరుగుచుండెనని వేదాంగజ్యోతిషములో నున్నది. అనగ, అప్పటికి ౧౫రోజులు వెనుకబడెను. ఋతువులు ఒక్కమాసము వెనుకబడుటకువిషువత్ షుమారు ౨౬°-౪౦' వెనుకకు జరుగవలెను. అనగ, ౧౫ దినములు వెనుకబడుటకు ౧౩°—౨౦' లేక షుమారు ౧౪ డిగ్రీలు వెనుకకు జరుగవలెను.

భరణిలో ౧౦ డిగ్రీలు గడచినపిమ్మట విషువన్ గలదని వేదాంగ జ్యోతిషములో చెప్పబడియున్నది. అక్కడనుండి కృత్తికాంశపు ప్రథమ బిందువునకు ౩°—౨౦' లు మాత్రమే దూరముగలదు- [ఇది ౧౫ రోజుల వ్యవధికి చాలదు]- కాని, భరణిలో ౧౦ డిగ్రీలనుండి కృత్తికానక్షత్రము వరకు కొలిచినచో ౩°—౨౦'+౧౦°—౫౦'=౧౪°—౧౦' అగును. [ఈదూరము ౧౫ రోజుల వ్యవధికి సరిపోవును.] [మూడవ పటము చూడుడు] బెంట్లీలెక్కను గ్రహించినచో త్రై॥సం॥ కును వేదాంగ జ్యోతిషమునకును మధ్య ౩°—౨౦' లేయుండును. కాని యిది ౧౫ దినముల వ్యవధికి చాలదు. మన సిద్ధాంతప్రకారమైనచో యీరెంటికిని మధ్య షుమారు౧౪° దూరముగలదు. ఇది ౧౫ దినముల వ్యవధికి సరిపోవుచున్నది. కనుక, బెంట్లీయూహ సరియైనదిగాదు. అయినను, బెంట్లీమాటను పూర్తిగ త్రోసివేయుటకును వీలులేదు. విశాఖలో నున్నవని చెప్పబడిన రెండు శాఖలును సరిసమానముగ నున్నవని యేల చెప్పవలెను? ఒకటి పెద్దదిగను, రెండవది చిన్నదిగను ఉండి ఉండవచ్చును. వసంతవిషువత్ కృత్తికా నక్షత్రముల వద్దనున్నచో, శరద్విషువత్ విశాఖాంశం లోపడి దానిని రెండుగ (సమభాగములు కాదు) చీల్చియుండవచ్చును. ఇంతవరకు మాత్రమే మన మంగీకరింపవచ్చును. ఈకారణముచే త్రై॥ సం॥ కాలము క్రీ॥పూ॥ ౨౩౫౦ సంవత్సరము లేగాని, ౧౪౨౭ కాదనినిర్ణయ మగుచున్నది.

ఇంతటితో వేదకాల నిర్ణయము కాలేదు. మనమింకను పైకి పోవచ్చును ఫాల్గుణం, చైత్ర పౌర్ణమీలు సంవత్సర ముఖములని పై నుదహరించిన తై॥ సం॥ వాక్యములలో నున్నది. ఈ వాక్యములలోని నిజభావమేమియో గ్రహింతము గాక.



# మృగశీర్ష

## ౨ వ అధ్యాయం

## "అగ్రహాయణ"

తైత్తిరీయ సంహిత VII, 4, 8 లో చిత్రాపూర్ణమాసయు ఫల్గుణీపూర్ణమాసయు సంవత్సరాది దినములుగ వర్ణింపబడినవి. ఈ దినములకే "చైత్రీ" యనియు "ఫల్గుణీ" యనియు జైమినీసూత్ర, తాండ్యబ్రాహ్మణములందు క్రమముగ నామాంతరములు గలవు. వీనికి క్రమముగ చైత్రపౌర్ణమి, ఫాల్గుణపౌర్ణమి అని అర్థము. ఈ రెండును దినములను సూచించు పదములేగాని మాసములను సూచించు పదములు గావని గుర్తించుకొనవలెను.

ఫల్గుణీ, చైత్రీదినములు సంవత్సరాదిదినము లెట్లగును? ఈ రెండుదినములును వసంతర్తువులో వచ్చినందున వీనికిట్టి వర్ణన సరిపోవునని శాయనులవారు తలంచుచున్నారు. కాని, క్రిందటి యధ్యాయములో చెప్పినట్లు హిమసంక్రమణము వద్ద మాఘపౌర్ణమితో సంవత్సరము ప్రారంభమగునెడల, ఫాల్గుణ చైత్ర పౌర్ణమీలు వసంతర్తువులో నెట్లుపడగలవు? ఇది అసంభవము. దీనిని సమర్థించుటకు శాయనుల వారు సౌర చాంద్రమానముల ననుసరించి రెండు వసంతము లేర్పడునని యేమేమో శ్రమపడిరి. కాని, యీ ప్రకా

ర మాలోచించినను— అధికమాసమును కలుపుకొనక పోయి నచో— సౌర వసంతము మరియొక మాసముముందునకే జరుగునుగాని వెనుకకు రాజాలదు. కనుక వీరిసమాధానము సరిగ లేదు.

ఇది గాక, శుశ్రుత గ్రంథములో కూడ ఫాల్గుణ మాసము వసంతర్తువులో పడినదని యొక వాక్యముగలదు. కాని యీవాక్యమును యిటీవల యెవరో యిరికించినట్లు స్పష్టమగుచున్నది. ఏలననగ, శుశ్రుత గ్రంథములో పరస్పర విరుద్ధములగు వాక్యములు రెండు ఒకేచోట గన్పట్టుచున్నవి అవేవనగ :— [శుశ్రుత: సూత్రస్థానం: అధ్యాయం ౬ :— తత్ర మాఘాదయో ద్వాదశ మాసాద్వైమాసిక మృతుంకృత్వాష డృతవో భవంతి। తేశిశిర వసంత గ్రీష్మవర్షాశరద్ధే మంతా.। తేషాం తపస్తపస్యౌ శిశిరః।......। అయనే ద్వేభవతః। దక్షిణముత్తరంచ। తయోర్దక్షిణం వర్షాశరద్ధేమంతాః ...। సవ షనిమేషాది యుగపర్యంతః కాలశ్చక్రవత్పరివర్తమానః కాలచక్రముచ్యతయిత్యేకే॥

ఇహతువర్షాశరద్ధే మంతవసంతగ్రీష్మప్రావృషః షడ్ఋతవో భవంతి। ...। తే తు భాద్రపదాద్యేనద్వైమాసికేన వ్యాఖ్యాతా। తద్యథా భాద్రపదాశ్వయుజౌ। వర్షః కార్తికమార్గశీర్షౌ శరత్। పౌషమాఘౌ హేమంతః। ఫాల్గుణ చైత్రో వసంతః। వైశాఖజ్యేష్టౌ గ్రీష్మః ఆషాఢశ్రావణౌ ప్రావృడితి॥......]

మొదటి వాక్యములోని వర్ణనము కొంతకాలమునకు

మారిపోవుటచే అప్పటి దేశకాలాదులకు సరిపోవునట్లుగ పై వాక్యములను మార్పదలచి యేమహామహుడో యీరెండవ వచనమును తదుపరి వ్రాసియుండును. లేనిచో, మూలగ్రంధమందే యిట్లు పరస్పర విరుద్ధములగు వచనము లుండుట అసంభవము. రెండవ వచనమునకు మొదట నున్న "ఇహాతు" అను పదములే దీనికి నిదర్శనము. శుశ్రుత, చరక గ్రంధములకు సంపుటీకరించిన వాగ్భటుడుకూడ మొదటి వచనమునే గ్రహించెనుగాని, రెండవ వచనమును గూర్చి ప్రశంసింపనైనలేదు. కనుక, తైత్తిరీయ సంహితా కాలములో ఫాల్గుణమాసము వసంతర్తువులో నుండెననుటకు వీలు లేదు.

ఫాల్గుణ పౌర్ణమి సంవత్సరాదిగనుండెనని తైత్తిరీయ సంహితా వాక్యమునకు శాయణులవారు చెప్పదలచిన సమాధానము సరిగ లేదు. అదియటుండ, ఒక్క తైత్తిరీయ సంహితయేగాకుండ, శతపధ బ్రాహ్మణము (VI, 2. 2, 18) లో ఫాల్గుణ పౌర్ణమి సంవత్సరములో "ప్రథమరాత్రిః" అని చెప్పబడియున్నది. తై॥ బ్రా॥ I, 1, 2, 8; సాంఖ్యాయన బ్రాహ్మణము IV, 4, V, 1,—లలోకూడ యిట్టి వాక్యములే గలవు. గోపథ బ్రాహ్మణము I, 19లో సంవత్సరముయొక్క రెండు కొనలును ఉత్తర, పూర్వ ఫల్గునుల యందు కలియునని వర్ణనగలదు- తాండ్య బ్రాహ్మణములో కూడ నిట్లేయున్నది. [శత॥ బ్రా॥ VI, 2.2-18. ఏషాహ సంవత్సరస్య ప్రథమారాత్రి ర్యత్ఫాల్గునీ పౌర్ణమాసే),

(తై॥ బ్రా॥ I, 1, 2, 8:—ఏషావై ప్రథమారాత్రిః సంవత్స రస్య యదుత్తరే ఫల్గునీ। ముఖత ఏవసంవత్సరిస్యాగ్ని మా ధాయరళీయాౙ భవతి॥) సాంఖ్యాయన 1V, 4.—ముఖం వా ఏతత్సంవత్సరస్య యత్ఫాల్గునీ పౌర్ణమాసీ॥), గోపథ బ్రాహ్మణ I, 19:—ముఖముత్తరే ఫల్గున్యౌ పుచ్ఛం పూర్వే। తద్యథా ప్రవృత్తస్యాంతౌ సమేతౌస్యాతాం ఏవమే తత్సంవత్సరస్యాంతౌ సమేతౌ భవతః॥

సూత్రకారులుకూడ యీయూహాలనే బలపరుచుచున్నారు. "వార్షికసత్రములను చైత్ర పౌర్ణమినాడైనను లేక ఫాల్గుణ పౌర్ణమినాడైనను ప్రారంభింపవలె' నని సూత్రకారుల వాక్యములుగలవు. అనగ, యివిసంవత్సరాది దినములని సూచన దీనిబట్టి ఫాల్గుణపౌర్ణమి యొకానొకప్పుడు సంవత్సరాదిగ నుండెననుట స్పష్టము:—అట్లే చైత్రపౌర్ణమికూడ ఫాల్గుణ పౌర్ణమిసంవత్సరాది యెట్లయ్యెనో ముందుపరిశీలింతము.

ఫాల్గుణపౌర్ణమి వసంతవిషువౙ వద్దకువచ్చెనని చెప్పుట అసంభవము. అట్లయినచో వసంతవిషువౙను తీసికొనిపోయి ఉత్తరాభాద్రలోపెట్టవలెను. అనగ క్రీ॥ పూ॥ ౨౦ వేలసంవత్సరములు వెనుకకుపోవలెను. ఇదిఅసంభవముకనుక దీనికింకొక గత్యంతరమేమనగ, హిమసంక్రమణమువద్ద ఫాల్గుణ పౌర్ణమితో నూతనసంవత్సరము ప్రారంభమయ్యెడిదని చెప్పవలెను ఇవన్నియు నొకవాక్యములో నుండుటచేత, మాఘ పౌర్ణమికివర్తించినభావమే యీ ఫాల్గుణచైత్ర పౌర్ణమాలకు కూడవర్తించును. ఈయర్థమునే భాస్కరభట్టాచార్యులవారు

కూడతమ భాష్యములో వ్రాసియున్నారు. దీనినిబట్టి తై॥ సం॥ లోని వాక్యమునకు నిజమైనఅర్థ మేమనగ; ఈ తై॥ సం॥ కాలమునకంటె పూర్వకాలమునందొకప్పుడు హిమసంక్రమణము వద్దఫాల్గుణపౌర్ణమినాడు నూతనసంవత్సరాది వచ్చుచుండెననియు, ఆపూర్వగాథనే యీసంహితలలోను బ్రాహ్మణములలోను నుదహరించిరనియు దీనిభావము అట్లయినచో వేదకాలమింకొక రెండువేల సంవత్సరములు వెనుకకుపోవును. [ఋతువులు సుమారు రెండువేల సంవత్సరములకొక నెలచొప్పున వెనుకబడుచుండునను సంగతిని మరువకూడదు.]

హిమసంక్రమణముువద్ద ఫాల్గుణపౌర్ణమితో సంవత్సరము ప్రారంభమయ్యె యెడల అప్పటిఖగోళస్థితి యీ క్రిందివిధముగనుండి యుండవలెను.

(౧) హి॥ సం॥:—ఉత్తరాభాద్ర ౩°-౨౦″లలో నుండవవలెను.

(౨) వసంతవిషువత్:— ఆర్ద్రా ఽ ద్యమందుండవలెను.

(3) గ్రీ॥ సం॥—ఉత్తరఫల్గుణీ ౧౦° డిగ్రీలలో నుండవలెను,

(౪) శరద్విషువత్:— మూలర్థమందుండవలెను.

గణితశాస్త్రరీత్యా వచ్చిన కృత్రిమాంశ విభాగములను వదలివేసి చూచినచో— కొంచె మించుమించుగ— ఖగోళస్థితి యీక్రిందివిధముగ నుండును.—

(౧) హి॥ సం॥:— ఉత్తరాభాద్రా నక్షత్రమునకు బహుదగ్గరగనుండును.

(౨) వ॥ విషువత్॥— మృగశీర్షానక్షత్రమునకు తూర్పున ౩°లలో నుండును,

(3) గ్రీ॥ సం॥:— ఉత్తరఫల్గుణీ నక్షత్రమునకు తూర్పున ౨°లలో నుండును,

(౪) శ॥ వి॥:— మూలానక్షత్రమునకు తూర్పున ౫°లలో నుండును.

కనుక, ఫాల్గుణపౌర్ణమిహిమసంక్రమణమువద్ద వచ్చినప్పుడు వసంతవిషువత్ మృగశీర్షానక్షత్రమువద్ద నుండితీరవలెనని పైవివరణమునుబట్టి స్పష్టమగుచున్నది. తై॥ సం॥ కాలములో వసంతవిషువత్ కృత్తికలలోనున్నది. ఇప్పుడుమృగశీర్షలోనున్నది. అనగ రెండునక్షత్రములు ముందునకు నడచినది. ఫాల్గుణపౌర్ణమి హిమసంక్రమణమువద్దకు వచ్చుటయే నిజమైనచో వసంతవిషువత్ మృగశీర్షలోనుండితీరవలెను, వసంతవిషువత్ యీరీతిగ ఒకప్పుడు మృగశీర్షలో నున్నదని తెలుపుటకేమైన ప్రమాణములుగలవా? లేవా? యనివిచారింపవలెను. మనమిప్పుడుదీనికి ఉపక్రమింతము.

నక్షత్రములలోనికెల్ల కృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రమనువర్ణనను బట్టి వసంతవిషువత్ ఒకప్పు డక్కడనుండెనని పైప్రకరణములో సిద్ధాంతీకరించితిమి. మృగశీర్షనక్షత్రము విషయమైకూడ అట్టివర్ణన యేదైననున్నదా? నక్షత్రములలోనికెల్ల మృగశీర్షానక్షత్రము ప్రథమనక్షత్రమను వర్ణనము

మన కెచ్చటనైన దొరికినచో, పైప్రకరణములోవలెనే యిచ్చటకూడమనపని చాలా తేలికయగును. కాని, మానదురదృష్టవశాత్తు అంతఖండితమైన వాక్యములెచ్చటను గానరావు. అయినను భయములేదు:—

అమరసింహుడు [I, 3, 23] తనకోశమునందు మృగశీర్షనక్షత్రమునకు "ఆగ్రహాయణి" అను నామాంతరము నిచ్చియున్నాడు: "ఆగ్రహాయణి" అనగ సంవత్సరమును ప్రారంభించు అనిఅర్థము. ఈపేరు యీనక్షత్రమున కెట్లువచ్చినది, పాణినీయ వ్యాకరణరీత్యా, అసలు యీపేరు సరియైనదగునా! కాదా? కానిచో, దీనికి సరియైనపేరేమి? అనునీయంశములనెల్ల నిప్పుడు విచారించెదముగాక.

మృగశీర్షా నక్షత్రమునకు "ఆగ్రహాయణీ" అను పేరును అమరసింహుడెట్లిచ్చెను? మాసములలో మార్గశీర్షమాసము ప్రథమమాసమని అమరసింహుడు భాగ్యటుడు మొదలగు పండితులెల్లరును ముందుగ నొకవిపరీత సిద్ధాంతమునుబయలుదేరదీసిరి. దీనిని బయలుదేరదీయుటకొక్కటే గొప్పకారణమున్నది ఏమనగ:-భగవద్గీతవంటిమహాగ్రంథములో॥మాసానాం మార్గశీర్షోఽహం ఋతునాం కుసుమాకరః" అని (X, 35 లో) శ్రీకృష్ణుడు అర్జునునకు జెప్పెను. ఈవాక్యములలో నిజముగ "మాసములలో మార్గశీర్ష మాసము ప్రథమమాసమ" ను భావమున్న మాట వాస్తవమే కాని, యీభగవద్గీతలోని భావముకూడ సరియైనదిగాదు. ఇంకొన్ని యపోహలపై చేయబడిన తప్పుడు సిద్ధాంతమైయున్నది. ఇదెట్లు

తప్పుడు సిద్ధాంతమో పిమ్మట వివరించెదను. ప్రస్తుతాంశ మేమనగా:—భగవద్గీతయంత యుత్కృష్టగ్రంథములో చెప్పబడిన భావములో కూడ దోషముండునాయను భ్రమచేత అమరసింహుడు వాగ్భటుడు మొదలైన పండితులెల్లరును ఆతప్పు సిద్ధాంతమునే యంగీకరించిరి. తదుపరి వచ్చిన వ్యాఖ్యాతలును జ్యోతిశ్శాస్త్రజ్ఞులనుకూడ యీసిద్ధాంతము నేదోరీతిగ అతుకులుపెట్టి సమర్థింపజూచిరి. ఈతప్పుడు సిద్ధాంతముయొక్క ఆధారములో మృగశిరానక్షత్రమున కమరసింహుడిచ్చిన "ఆగ్రహాయణి" అను పదమును తదుపరి వచ్చిన వ్యాఖ్యాతలు యీక్రింది రీతిగ సమర్థింపజూచిరి,

మార్గశిర పౌర్ణమిసంవత్సరములో ప్రథమరాత్రియను నూహతో వీరు బయలుదేరిరి. నూతనసంవత్సరమును ప్రారంభించురాత్రిగనుక యీమార్గశిరపౌర్ణమికి "ఆగ్రహాయణి" అనుపేరువచ్చినదట! నూతనసంవత్సరమును ప్రారంభించుపౌర్ణమి మార్గశిరమాసములో వచ్చినదగనుక ఆమార్గశిరమాసమునకు "ఆగ్రహాయణిక" అనుపేరువచ్చినదట. సరే ఇంతవరకు బాగుగనేయున్నది కాని, "ఆగ్రహాయణి" అను పేరుగల ఆమార్గశిర పౌర్ణమినాడు పూర్ణచంద్రుడు మృగశిరానక్షత్రమువద్దనుండుటచే ఆమృగశిరా నక్షత్రమునకుకూడ "ఆగ్రహాయణి" అనిపేరువచ్చినదట! దీనిపై ఆక్షేపణయేమనగా:ఇదితలక్రిందు వ్యాపారముగనున్నది. నక్షత్రముయొక్క పేరునుబట్టి నెలకుపేరు వచ్చునుగాని, నెలయొక్క పేరునుబట్టి నక్షత్రమున కెప్పుడును పేరు రాదు. దీనికి ప్రమాణముపాణిని

[iv,2, 21, సాస్మిన్ పౌర్ణమాసీతి సంజ్ఞాయామ్] పోసీ, నెలయొక్క పేరును బట్టియే నక్షత్రమునకు పేరువచ్చినదన్నను పాణిని iv, 2, 3, ప్రకారం [నక్షత్రేణ యుక్తః కాలః] నక్షత్రము యొక్క పేరులో మొదట "ఆ' (దీర్ఘము) ఉండుటకు వీలు లేదు; చివరనున్న 'ఇ' కారముకూడ అసంభవము కనుక మృగశిరానక్షత్రమున కమరసింహుడిచ్చిన 'ఆగ్రహాయణి" అనుపేరు సరియైనదికాదు. పాణినిసూత్రముల ప్రకారము యీక్రమమును తలక్రిందుచేయవలెను ఎట్లనగ:— అసలు నక్షత్రముపేరు 'అగ్రహాయణ" (అగ్ర+హాయన) ఈనక్షత్రముయొక్క పేరునుబట్టి, యేదినమందు పూర్ణచంద్రుడీనక్షత్రమువద్దనుండునో ఆదినమునకు 'ఆగ్రహాయణి" అను పేరు పాణిని(IV, 2, 3, IV, 1, 15,) సూత్రములనుబట్టి వచ్చును ప్రథమాక్షరమునకు దీర్ఘమును; తుదను స్త్రీలింగరూపమగు "ఇ' కారమును వచ్చును. ఈసూత్రముచేతనే "చిత్ర'' నక్షత్రమునుండి "చైత్రీ' అనుపేరు చైత్రపౌర్ణమికివచ్చినది; అట్లే ఫల్గుణినక్షత్రమునుండి 'ఫాల్గుణీ" యనుపేరు ఫాల్గుణపౌర్ణమికివచ్చినది. పాణిన్యాచార్యులవారు "ఆగ్రహాయణి' అను పదమును ,,మార్గశిరపౌర్ణమి,, అనుఅర్థములో ప్రయోగించిరేగాని 'మృగశిరానక్షత్రమ,,ను అర్థములో నెచ్చటను ప్రయోగింపలేదు.

పౌర్ణమియొక్క పేరునకు ,,ఠక్ ,, ప్రత్యయము చేర్చుటచే నెల యొక్క పేరువచ్చునని పాణిని [IV, 2, 22 ఆగ్రహాయణ్యశ్వత్థాద్ఠక్] సూత్రమునుబట్టి తెలియుచున్నది. ఈప్రకార

నుగ "ఆగ్రహాయణి" నుండి "ఆగ్రహాయణిక" అను పేరు మార్గశిరమాసమునకువచ్చినది. ఈసూత్రము ననుసరించియే "చైత్రీ" నుండి "చైత్రిక" అను పేరు చైత్రమాసమునకు వచ్చినది. పాణిన్యాచార్యులవారు "ఆగ్రహాయణిక" అనుఒక్క-పదమునే "మార్గశీర్షమాసము" అను నర్థములో ప్రయోగించిరిగాని, యింకొక పదమును ప్రయోగింపలేదు. కనుక యీపదమును "అగ్రహాయణ", అనునక్షత్రపు పేరు నుండియే పైసూత్రముప్రకారము గ్రహించియుండవలెను. ఇంతవరకు చెప్పినమార్పుల నిట క్లుప్తముగ వివరించెదను.

(౧) "అగ్రహాయణ":—ఇది మృగశిరా నక్షత్రము యొక్క- పేరు.

(౨) "ఆగ్రహాయణి":— ఇది మార్గశిర పౌర్ణమిపేరు } దీర్ఘము: పాణిని IV, 2, 3. "ఈ" పాణిని IV, 1, 15.

(౩) "ఆగ్రహాయణిక":— ఇది మార్గశిరమాసంపేరు: } "తక్" ప్రత్యయం: IV, 2, 22. పాణిని:

కనుక, అసలు మృగశిరానక్షత్రముయొక్క- పేరు "అగ్రహాయణ". అమరసింహుడిచ్చిన "ఆగ్రహాయణి" అను పేరు తప్పు.

మృగశిరానక్షత్రమునకు "అగ్రహాయణ" అను పేరుండుటచే అది యొకప్పుడు మొదటి నక్షత్రమైయుండవలెను. కృత్తికలు ప్రథమ నక్షత్రమైనట్లే అగ్రహాయణ లేక మృగశీర్షానక్షత్రముకూడ ప్రథమ నక్షత్రమైయుండవలెను. అనగ విషువన్ ఒకప్పుడు అచ్చటయుండి యుండవలెను. ఈవిధ

ముగ, నక్షత్రమున కివ్వవలసిన ప్రథమస్థానమును మాసమున కిచ్చుటచేత, మార్గశిరమాసము ప్రథమమాసమను భ్రమలో భగవద్గీతారచయితలును, యిటీవలి పండితులునుకూడ పడిపోయిరి. ఇట్లొక్కసారి భగవద్గీతారచయితలే పొరబాటులో పడిన పిమ్మట, తరువాత వచ్చిన వ్యాఖ్యాతలు దీనికెట్లో అతుకులుపెట్టి సమర్థింప జూచిరి. మార్గశిర మాసమునకు “ఆగ్రహాయణిక” అను పేరున్నది గనుక ఇదే మొదటి మాసమని ఒక సౌరపండితుడీ గీతావాక్యమును సమర్థించెను! ఆహా! నోటికిపెట్టవలసిన కళ్ళెమును తోకకుపెట్టుటచే యెట్టి అనర్థములు వాటిల్లెనో తెలుపుటకిదియే గొప్ప నిదర్శనము. “ఆగ్రహాయణిక” అనగ మొదటి మాసము కాదు; మొదటి నక్షత్రముతో కూడుకొనియున్న పౌర్ణమి గల మాసమని అర్థము—యిట్టి మాసము మొదటి మాసముకాజాలదు. ఎట్లనగ, మనకిప్పుడు “అశ్వనీ” నక్షత్రము మొదటి నక్షత్రము. అంతమాత్రముచే, ఆశ్వీజమాసము (అనగ, అశ్వనినక్షత్రముతో కూడుకొనియున్న పౌర్ణమిగల మాసము) మొదటి మాసమగునా? కాదు అట్లే, ‘అగ్రహాయణ’ నక్షత్రముతో కూడిన పౌర్ణమిగల “ఆగ్రహాయణిక” మాసము ప్రథమ మాసము కాజాలదు.

అయినను, కానిమ్ము; మార్గశిరమాసమే ప్రథమమాసమైనచో వచ్చిన అనర్థమేమి? ఏమనగ:— మార్గశిరమాసమే ప్రథమమాసమైనచో, హిమసంక్రమణమువద్ద మార్గశిరపౌర్ణమినాడు సంవత్సరారంభమయ్యెనని అర్థమగును. అన

గ, మృగశిరానక్షత్రము గ్రీష్మసంక్రమణములో నున్నదని అర్థమగును. ఇట్లుజరుగుట కింకను షుమారు ౬౦౦౦ సంవత్సరములైనను పట్టును; లేదా ౨౫ వేల సంవత్సరములక్రిందట నైన జరిగియుండవలెను. కనుక యిది అసంభవము. పోనీ, మార్గశిర పౌర్ణమి వసంతవిషువత్ వద్దనుండగ సంవత్సరారంభమైనదన్నచో, అదియు సరిపడదు. ఎట్లనగ:— దీనివలన మనము క్రీ॥ పూ॥ ౨౦ వేల సంవత్సరములు వెనుకకు పోవలసివచ్చును. ఇదినిరాధారమైన ఖుంశము. కనుక, ఎటుచూచినను మార్గశిరమాస మెన్నటికిని ప్రథమమాసము కాజాలదు.

తై॥ సం॥లో చెప్పినరీతిని హిమసంక్రమణమువద్ద ఫాల్గుణ పౌర్ణమితో సంవత్సర మారంభమైనప్పుడు, వసంతవిషువత్ మృగశీర్ష నక్షత్రములోనుండెను. అనగ, మృగశీర్ష మొదటినక్షత్రమయ్యెను అందువలననే, దానికి ‘‘అగ్రహాయణ’ అనుపేరువచ్చినది. మృగశిర ప్రథమనక్షత్రమని ఖండితముగ జెప్పు ప్రత్యక్ష ప్రమాణపూర్వకములగు వాక్యములు లేక పోయినను ‘‘అగ్రహాయణ’ యను యీపేరునుబట్టి మనము దీనియొక్క నిజస్వభావమును కనుగొనవచ్చును. కనుక, పై తైత్తిరీయ సంహితావాక్యము నిది బలపరచుచున్నది.

ఇంకను పరీక్షించెదముగాక. వసంతవిషువన్ మృగశిరలో నున్నచో, శరద్విషువత్ మూలానక్షత్రములో నుండవలెను. ‘మూలా’ నక్షత్రమొకప్పుడు ప్రథమ నక్షత్రమగుటచే, దానికాపేరువచ్చెనని బెంట్లీ పండితుడు తలంచుచున్నాడు.

కాని దీనికాధారమేమియు గన్పింపదు. కాని, మనమింకొక యూహ చేయవచ్చును. వసంతవిషువన్ మృగశీర్షలోనున్న కాలములో సూర్యుడు మృగశీర్షలోనికి వచ్చినప్పుడు సూర్యాస్తమయముతోకూడ పశ్చిమదిక్కున మృగశీర్షా నక్షత్రము గ్రుంకుచుండగ, యిట తూర్పున 'మూలా' నక్షత్రము ఉదయించుచుండెడిది. మృగశిర సూర్యుని వద్దనుండుటచే గుర్తించుటకు వీలుండెడికాదు. కావున, సాయంకాలపుపూట తూర్పున మూలా నక్షత్రము ఉదయించినకాలమే విషువన్ కాలమని మనవారికి గుర్తుగనుండెడిదిగాబోలు! అందుచేతనే, దీనిని మూలా నక్షత్రమని పిలుచుచుండిరని మనమూహించుకొనవచ్చును. ఈ యూహకూడ మనసిద్ధాంతమును బలపరుచుచున్నది. ఇంకనుమరికొన్ని ప్రమాణములు విమర్శింతము.

ఫాల్గుణ పౌర్ణమితో హిమసంక్రమణమువద్ద సంవత్సరాది యగుచున్నది. అనగ, అప్పుడే ఉత్తరాయణ మారంభమగుచున్నది. ఫాల్గుణ పౌర్ణమి మొదలుకొని ౬ మాసములవరకు —అనగ భాద్రపద పౌర్ణమి వరకు—ఉత్తరాయణము. భాద్రపద పౌర్ణమి గడచిన మరుదినమునుండియు—గ్రీష్మసంక్రమణము దాటిన తరువాత—తిరిగి ఆరు మాసములవరకు దక్షిణాయనము. అనగ, భాద్రపద బహుళ పాడ్యమినుండి దక్షిణాయనము, లేక పితృయానము ప్రారంభమగును. భాద్రపద మాసములో బహుళ పక్షమంతయు పితృయానములోని ప్రథమపక్షమగును. ఆ కారణముచేతనే, మనవారిప్పటికిని

యీ భాద్రపద బహుళ పక్షమును పితృపక్షమనియు, లేక మహాలయ పక్షమనియు చెప్పుచుందురు.

ఇప్పుడు దక్షిణాయనము (పితృయానము) ఆషాఢమాసములోనికి జరిగినను మనవారిప్పటికిని యీ వెనుకటి యాచారమును మాత్రము విడువలేదు. పూర్వమొకప్పుడు వసంతవిషువన్ మృగశీర్షలోనుండెనని తెలుపుటకిది యొక ప్రబలనిదర్శనము.

ఒక్క హిందువులేగాక, పారశీకులుకూడ యీపక్షమందే పితరులనర్పింతురు. కనుక, పూర్వకాలమున మృగశీర్ష యుగములో హిందువులును, పారశీకులును కలిసియుండిరనియు, అప్పుడే యీ యాచారము ప్రబలెననియు చెప్పుటకు మనకొకమంచి ప్రమాణము లభించుచున్నది. వారియొక్క నెలల పేర్లనుబట్టికూడ మనమృగశీర్ష సిద్ధాంతము ధృవపడుచున్నది.

సింహావలోకనము:—

(౧) ఒక్క తై॥ సం॥ లోనేగాకుండ, అనేకమైన బ్రాహ్మణములలోను, సూత్రములలోనుకూడ ఫాల్గునపౌర్ణమినాడు హిమసంక్రమణమువద్ద సంవత్సర మారంభమయ్యెనని చెప్పబడియున్నది.

(౨) మృగశిరా నక్షత్రముయొక్క "అగ్రహాయణ" యను నామాంతరమునుబట్టి, అదినక్షత్రములలోనికెల్ల ప్రథమనక్షత్రమనియు, ఆకాలమున వసంతవిషువన్ అచ్చట నుండెననియు ధృవమగుచున్నది.

(3) మూలానక్షత్రము శరద్విషువన్‌వద్ద నుండుటచేతను,

వసంతవిషువత్ కాలములో సాయంకాలము ఆనక్షత్రము తూర్పున నుదయించుటచేతను దానికి ౹.మూలయనుపేరు వచ్చినది. ఈవ్యుత్పత్త్యర్థముకూడ మనసిద్ధాంతమునే బలపరుచుచున్నది.

(౪) హిందూ, పారశీకమతములలో భాద్రపద బహుళ పక్షము పితృపక్షమగుటచే భాద్రపదపౌర్ణమినాడు గ్రీష్మసంక్రమణము తటస్థించెవని తెలియుచున్నది.

ఈనాల్గంశములును మనమృగశీర్ష సిద్ధాంతమును బలపరుచుచున్నది. ప్రధానమైన నాలుగుస్థానములును (వ॥ విషువత్ గ్రీ॥ సం॥; శ॥విషువత్; హి॥సం॥) సరిగనున్నవి. ఇంతకంటె యెక్కువ ప్రమాణ మేమికావలెను? అయినను, ముందు అధ్యాయములో యింకను విమర్శింతుముగాక.

# మృగశీర్ష

## ౧, వ అధ్యాయము

### మృగశిరము

నిర్మలమగు నిశీథసమయమున బ్రహ్మాండగోళమువంక దృష్టి నిగిడించి పరికించినచో యీమృగశీర్షా నక్షత్రముండు ప్రదేశమెంతయో రమ్యముగను మనోనయనానందకరముగను గన్పట్టును. నిరుపమాన తేజమును వెలిగ్రక్కుచు జ్యోతిర్మూర్తులవలె ప్రకాశించు నక్షత్రపంచకమును, మధ్యమధ్య మిణుకు మిణుకుమనుచుండు నసంఖ్యాకములగు తారాగణములును, తత్సమీపమున బారుచుండు పాల మిన్నేటి తరంగములును బ్రహ్మాండ కటాహమున కెంతయువన్నె వెట్టుచున్నవి. అత్యంత రామణీయకమును, గంభీరమును నగు నిట్టి ప్రకృతి సౌందర్యమును కన్నులారా గాంచినప్పుడు మనప్రాచీనపుటార్యుల కెంతటి హృదయాహ్లాద ముప్పతిల్లెనో! సూర్యభగవానుడీ రమ్యప్రదేశమునకు వేంచేసినప్పుడు వసంతోదయమగుటచే ప్రకృతి కాంతమరింత శోభాయమానముగ వెలుంగజొచ్చెను. ఉత్తేజకరమగునిట్టి ప్రకృతిసందర్శనముచే ప్రాచీనఋషీశ్వరుల భావరసముపొంగి పొరలి వెల్లువలై యనంతముఖముల పారెననుటకేమియు సందేహములేదు తమ కవితామాధుర్యముచేతను, అనర్గళమగు భావనా పటిమచేతను,

ప్రాచీన ఋషీశ్వరులీ సుందరతరమగు దృశ్యమును గేయము లచే కీర్తించిరి; అలంకారములచే వర్ణించిరి; వాక్కుసుమ ములచే పూజించి యానందించిరి; ఒకరినిమించి యొకరు ఉపమానములను, ఉత్ప్రేక్షలను కల్పించిరి, గాథలనల్లిరి. యీ గాథలన్నియు వేదవాఙ్మయము నందంతటను విరివిగ గాన్పించు చున్నవి. ఈ గాథలకును, యీ అలంకారములకును సరియైన యేకవాక్యతను యింతవరకెవరును సంతృప్తికరముగ చేసి యుండలేదు. కాని, వీనినన్నిటిని పరిశీలించి చూచినచో మన మృగశీర్ష సిద్ధాంతము మరింత బలపడుటకేమియు సంది యము లేదు. కాన, యీయధ్యాయములో యీజ్యోతిర్కూ టమునకు సంబంధించిన గాథలనుగూర్చి కొంచెము విమర్శించి చూతము.

ఈ జ్యోతిర్కూటమును కొందరు "మృగముయొక్క శిరస్సు' ని వర్ణించిరి, మరికొందరు "మృగ" మేయని వర్ణించిరి; మరికొందరు "మృగరూపమునుధరించిన ప్రజాపతి" యనియు లేక యజ్ఞోపవీతమును (పటకాను) ధరించిన పురు షుడ" నియు వర్ణించిరి. "నడుమునకు పటకాపెట్టుకొన్న వేటకాడ" ని గ్రీకులు వర్ణించిరి. ఈయొక్క జ్యోతిర్కూ టమే యిందరికిన్ని విధములుగ నెట్లుగాన్పించెనోచూడవలెను.

మొట్టమొదట "పటకాతోనున్న వేటకాడ" ను గ్రీకుల వర్ణనముగూర్చి విచారింతము.

ఇది గ్రీకుల వేటకాని (ఓరియన్) వర్ణనము.



(లేక) యజ్ఞోపవీతధారియైన ప్రజాపతి.

పైనవ్రాసినపటమును పరిశీలించినచో వేటకానియొక్క తలయు, రెండుభుజములును, రెండుమోకాళ్లును, ఆతడు నడుమునకుపెట్టుకొన్న పటకాయు, పటకానుండి వ్రేలాడుచున్న కత్తియు గోచరము కాగలవు. ఆకాశమందు చెదరిపడియున్న యీనక్షత్రములలోనుండి ప్రాచీనులీవేటకాని రూపమునెట్లు కల్పించుకొనిరో చూడుడు! ఈరూపమునే „యజ్ఞోప వీతధారియైన ప్రజాపతి' యని హిందువులుు వర్ణించిరి.

ఈనక్షత్ర సమూహమునుండియే కొందరు మృగమును (జింకను) కల్పించుకొనిరి పైపటములోని వేటకానితలను జింక తలతోడను, వేటకానియొక్క మోకాళ్లను భుజములను జింకయొక్క నాలుగు గొరిజలతోడను పోల్చుకొనిరి; తక్కినశరీరమంతయు ఆకాశములోపల నున్నదని చెప్పిరి.

కాని, వేదవాక్యములలో జింకయొక్క తలనుగూర్చి చెప్పబడినది. జింకనుగూర్చి చెప్పబడలేదు. ఈజింక తలయేది? పైపటములో సూచింపబడిన వేటకానితలయే యీజింకతలయందుమా మనకుజింకతలయొక్క స్వరూపమువచ్చుటలేదు కనుక, మృగముయొక్క శిరస్సును వేటకానితలతో పోల్చుటకువీలులేదు అయితే, యిక వేదములో చెప్పబడిన మృగముయొక్క శిరస్సు యెక్కడనున్నది శతపదబ్రాహ్మణము II, 28 లో రుద్రుడు "ప్రజాపతి తలను బాణముతో నరికెననియు, అంతట ఆతల బాణముతోకూడా ఆకాశమున కెగిరిపోయి అచ్చట నేయుండెననియు వర్ణనగలదు.

[ఇషుణాతస్య శిరశ్చిచ్ఛేద్......ఇషుః శిరశ్చేత్యుభయమంతరిక్షే ఉత్ప్లుత్య నక్షత్రాత్మనావమ్ ఖతంద్రృశ్యతే]

ఐ. బ్రా III, 33 లో కూడ యిట్టి వర్ణనయేగలదు. వృత్రుడు మృగరూపమున రాగా, యింద్రుడు వానితలను బాణముతో నరికెనని ఋగ్వేదములో ననేకచోట్లగలదు. గ్రీకు గాధలలోకూడ నిట్టివరనలేగలవు. కనుక, మనకిప్పుడు "బాణ

ము గ్రుచ్చబడియున్న జింకతల** కావలెను. ఈ రూపము మనకీ క్రింది విధముగ సిద్ధించును.

పైపటములో గని, వేటకాని మొలపటకాయే:—జింకతల,తలలోని బాణము.

| | |
|---|---|
| వేటకాని ఎడమభుజము, కుడి మోకాలు ... ... | జింకయొక్క రెండు చెవులు. |
| వేటకాని ఎడమమోకాలు:— | జింకయొక్క ముట్టె. |
| వేటకాని పటకాక్రిందగాన్పించు రెండు నక్షత్రములు ... | జింకయొక్క కళ్ళు. |




జింక తలమీాదనున్న మూడు నక్షత్రములకే "ఇల్వల" ములని పేరు. ఇప్పటికినిఆకాశమందున్న యీా మూడు నక్షత్రములనే "మృగశిరా" నక్షత్రమని మనవారు చూపించుచుందురు. కనుక, గ్రీకుల "ఓరియాన్" అను వేటకాడును, హిందువుల "మృగశీర్ష," లేక "ప్రజాపతి" లేక "మృగరూపుడును" యజ్ఞరూపుడునునైన ప్రజాపతి"—యీా వర్ణనలన్నియు ఒక్క జ్యోతిర్కూటమునే వర్ణించుచున్నవి. ఓరియానునియొక్క మొలపటకాయే ప్రజాపతియొక్క యజ్ఞోపవీతము.

దీనినే వీట్లీపండితుడిట్లని వర్ణించెను:—సౌందర్యవతియు, ముగ్ధయునైన రోహిణిని కామాతురుడైన ప్రజాపతి వెంటనంటుచుండగ, వెనుకనుండి మృగవ్యాధుడు (Sirius) (కిరాతరూపధారియైన రుద్రుడు) తనయొక్క బాణముచేత ప్రజాపతిని పడగొట్టెను. [పటముచూడుడు]. ఈ కథయే కొలది భేదముతో పురాణాదులలో వర్ణింపబడినది. ఈ వర్ణనమంతయు బహు సమంజసముగనున్నది. ఈ విధముగ యిచ్చటనున్న నక్షత్రములనన్నిటిని ఆర్యులుగుర్తించిరి. రోహిణీనక్షత్రమే ముగ్ధయైన స్త్రీ. గ్రీకుల ఓరియానను వేటకాడే కామాతురుడైన ప్రజాపతి. దానికి వెనుకనున్న "మృగవ్యాధ" (Sirius) నక్షత్రమే కిరాతరూపధారియైన రుద్రుడు. ఈ నక్షత్రగణము ప్రక్కనున్న తెల్లనిపట్టీని మనవారేమని వర్ణించిరి? దీనిని పాశ్చాత్యులు "మిల్కి-వే (Milky-way)" (పాల ప్రవాహము) అని చెప్పుదురు. మనవారు ఆకాశగంగ లేక "పాలమిన్నేరు" అని యందురు. ఈ పాలమిన్నేటిని గూర్చినగాథలేమైనగలవేమో విచారింతము.

దేవయాన మొకప్పుడు వసంతవిషువత్తు వద్ద ప్రారంభమయ్యెనని యిదివరలో వివరించియుంటిమి. విషువత్తు మృగశీర్షలో నికివచ్చినప్పుడు, యీ దేవ పితృయానములకు సంబంధించిన గాథలనన్నిటిని తీసికొనివచ్చి యీ నక్షత్ర సమూహమున కంటగట్టిరి. తదుపరి యీగాథలనే యనేకవిధములుగ పెంచిరి. ఈరీతిని విచారింపగ, విషువనులు దేవ పితృలోకముల రెంటికి మధ్యనున్న సరిహద్దులుగ గ్రహింపబడినవి. ఆకారణముచేతనే

విషువనులు దేవలోకమునకు "ద్వారములు" గ భావింపబడి నవి. ఈ ద్వారములు కుక్కలచే కాపాడబడుచుండెను. ఋ I, 48, 15లో "ఉషస్సు దేవలోకద్వారములను వెలిగించుచున్నది" ను వర్ణనగలదు ఋ I, 13, 6; II, 3, 5 లలో కూడ యీ ద్వారములను గూర్చిన ప్రశంసగలదు. వాజసనేయ సంహితలోకూడ యిట్టి ప్రసంగమేగలదు. యజ్ఞవేదిక నమర్చుటలోకూడ యీ ద్వారము లీగోళమును రెండు సమభాగములుగ విభజించుచున్నట్లు యేర్పాటుచేయబడినది. గ్రీకుపురాణములలోకూడ యిట్టి వర్ణనలేగలవు.

పారశీకుల ప్రాచీనగ్రంథములుకూడ యిట్లే వర్ణించినవి. ఈవిషువన్ అనునది దేవలోకమునకు ద్వారమనియేగాకుండ, యిదియొక "వంతెన" యనికూడ చెప్పబడియున్నది దీనికి "చిన్‌వత్ వంతెన" అని పారశీగ్రంథములలో పేరుపెట్టిరి. ఇది దేవపితృలోకముల రెంటిని కలుపునట. ఈవంతెనను కుక్కలు కాపలాకాయుచుండునట ఈకుక్కలసహాయముతోడనే చనిపోయిన మనుష్యులయొక్క ఆత్మలు యీవంతెనను దాటి పితృలోకమునకు పోవునట. దీనికిని హిందూగాథలకును సామ్యముగలదు. నరకద్వారమువద్ద మూడుతలల కుక్కయుండుననియు, యమలోకమునకు పోవుత్రోవలో నాలుగుకండ్లుగల యమునికుక్కలుండుననియు ఋX, 14, 10 లో వర్ణింపబడియున్నది. దీనిలోని భావమేమి? విషువత్ ఒకప్పుడు మృగశీర్షలోనుండెనని తలచినచో దీనికి చక్కని సమాధానము కుదురును. విషువత్ అనునది దేవయమలోకముల మధ్య

నున్నద్వారము. "శ్వాన్", ప్రశ్వాక్"-అనునక్షత్రములు రెండును యీద్వారమును గాపాడుచున్నకుక్కలు (ఈరెంటిమధ్య నుప్రవహించుచున్న పాలమిన్నే గే వైతరణీనది) ఈనదిమీద నున్న వంతెననేపారశీకులు "చిణ్వత్" వంతెనయందురు. ఈ వంతెన "దేవపితృలోకములమధ్య ప్రవహించుచున్ననది మీదకట్టబడియున్నది" గియర్ పండితుడువర్ణించెను యమలోకమునకుచేరకముందు ఆత్మలన్నియు "వైతరణీ" నదినిదాటవలసియుండునని మనపురాణములో గలదు. గ్రీకులలో కూడ నిట్టిప్రశంసయేగలదు ఈ వైతరణిఅనగనేమి? పైనుదహరింపబడిన "పాలమిన్నే రే". ఇదే దేవపితృలోకములమధ్యనున్నది దీనికే తదుపరి "స్వర్ నది" అనేపేరువచ్చినది ఈ నదిలో నొక "నొక" గలదనియు యీనదికి రెండువైపులను కుక్కలు కాపలా కాయుచున్నవనియు గ్రీకులువర్ణించిరి. ఈ నొకను ముఖపటములో చూడనగును. ఋX,63,10, లో ఈ నొకనుగూర్చిన ప్రశంసగలదు. 'దేవలోకమునకు చేరుటకై మంచిచుక్కానిగల దేవనావలో (దైవీంనావం) పోవలెను,, అని యిచ్చట వర్ణింపబడెను. ఈవిధముగ జూచినచో వైతరిణిలో నొకనావ యున్నదనియు, యీనదికి రెండుప్రక్కల కుక్కలు కాపలాయున్నవనియు మనగ్రంథములలోకూడ గలదు హిందూ, పారశీక, గ్రీకుగాథలనుబట్టి, మనకు ఆకాశమందు ప్రత్యక్షముగ గాన్పించు తెల్లనిపట్టియే వైతరిణియనియు, అందలి నక్షత్రములే నావయనియు, దాని కిరుప్రక్కలనున్న నక్షత్రగణములే యమునికుక్కలనియు, యిచ్చట

విషువన్ ఉండుటచే యానది దేవ యమలోకములమధ్య నున్నదనియు,మనపూర్వులు తమపురాణగాధలను తీసికొనివచ్చి తమకాకాశమందు ప్రత్యక్షముగ గాన్పించు తారాగణములతో పోల్చిరనియు సిద్ధించుచున్నది. దీనిపై నింకను వన్నెలు చిన్నెలు గలవు.

వసంత, గీష్మ, వర్షర్తువులు దేవయానమని శతపథబ్రాహ్మణముII, 1, 3, 1, లోనున్నది. "కుక్కలతో సంవత్సరారంభమయ్యె' నని ఋI, 161, 13, లోనున్నది. దీనినిబట్టి విషువత్ ఒకప్పుడు మృగశీర్షలోనుండెనని సిద్ధించుచున్నది.

ఋగ్వేదమందలి కుక్కలకును పారశీగ్రంథములోని కుక్కలకును చాలవరకు పోలికగలదు "వెండిడాడ్" అనుపారశీగ్రంథములో యీకుక్కలను 'పెషుపన' అనివర్ణించిరి.—అనగ, ,,యమలోకమునకు పోవుత్రోవనుకాపాడుచుండు" అని అర్థము. ఈకుక్కలనే 'చత్ఱచష్మెౝ'' అనిపారశీగ్రంథములోను ,,చతుర్—అక్షౌ,, అనిఋగ్వేదములోను (X, 14, 11) వర్ణించిరి. ఈ రెండుపదములును సమానార్థకములే (అనగ ,,నాలుగుకండ్లుగల,, అనిఅర్థము. కాని, వీనిరంగుమాత్రము భిన్నముగ వర్ణింపబడినది. పారశీగ్రంథములు వీనిని పసుపుపచ్చరంగుగల కుక్కలనివర్ణించినవి. కాని, యమునికుక్కలకు ,,శబలౌ,, (పొడలుగల) అనువిశేషణమును ప్రయోగించిరి. ఈభేదమంతగ గమనింపదగినదికాదు. అయినను, సూర్యుని మృగములు ,హారీత, (పసుపు) వర్ణములుం గలవని ఋX,86,3

లో వర్ణనగలదు. ఈ కుక్కలను, మృగమును ఒకటేయనుం డుటచే ఒకదానికంగు మఱియొకదానికి చెప్పియుండవచ్చును. ‚‚మృగ,, మనగ మృగశీర్షలోనున్న మృగమని అర్థము చేసి కొన్నచో పారశీవర్ణనమునకును దీనికిని విశేషభేదముండదు. ‚అదిగాక, యముని వద్ద దూతకృత్య మొనర్చు కుక్కలు ‚శ్యామ,, ‚‚శబల,, వర్ణములుగలవనిఅ థర్వవేదము VIII, 1.9లో వర్ణనగలదు. ఈవర్ణనము పారశీవర్ణనమునకు సరిపోవుచున్నది. ఈరీతిగపోల్చి చూచినచో, పారశీగ్రంథములలోని కుక్కలును ఋగ్వేదమందలి కుక్కలును ఒకటేనని తేలుచున్నది.

ఋగ్వేదములో వర్ణింపబడిన ‚‚సారమ,, యనునది యీ కుక్కయే కావచ్చునని మన మూహింపవచ్చును. ఈయూహను బలపరుచుట కొనచిన్నకద గలదు. ఇంద్రుడు తనయావులను (వెలుతురును) వెదకుటకై ‚‚సారమ,,ను (కుక్కను)పంపెనట: కాని, యీయావుల నెత్తుకొనిపోయిన వృత్రుడు యీ ‚సారమ, కు పాలుపోసి (లంచమిచ్చి) పంపివేసెనట. అంతట ‚సారమ, మరలివచ్చి తనకెచ్చుటను ఆవులు కనిపించ లేదని యింద్రునితో అబద్ధ మాడెనట. అంతట యింద్రుడు ‚సారమ, ను తన్నెనట. తన్నగనే ‚సారమ, పాలను వెడల గ్రక్కెనట. అదిగాక, ఋIV,57.5 లో ‚‚శునాశీరు,, లను గురించి యొకప్రార్థన గలదు. మీరు దేవలోకములో చేయు పాలను మాభూమిమీదకు వర్షింపజేయుడని యొకప్రార్థన

గలదు, ఈపాలు యేమైయుండవచ్చును ఇవి 'పాలమిన్నేటి, లోని పాలైయుండవలెను. ఈసారమ, సునాశీర యనునవి యీయేటిదరిని కావలాయున్న కుక్కలైయుండవలెను. ఈ యంశమునే మాక్సిముల్లరు పండితుడుకూడ బలపరుచు చున్నాడు. "శునాశీరా", అనుపదమునుండి 'శేర్య", యను పదము పుట్టియుండవచ్చుననియు, దానినుండి 'సిరియస్ (Sirius) అనుపదము పుట్టియుండవచ్చుననియు, ఆత డూహించెను. "శ్వాన", అనునక్షత్రమునకే "సిరియస్", అని యింగ్లీషుపేరు. కనుక యీపోలికసరిగనే యున్నది. అదిగాక, శతపథబ్రాహ్మణము II, 1,2,9 లో మృగశీర్షను గురించి ప్రశంసించుచు, రుద్రునిచే పొడువబడిన ప్రజాపతి శరీరమునకు "వాస్తు", అనిపేరుపెట్టిరి. ఈవాస్తును కాపాడుట కై "వాస్తోష్పతి", కుక్కరూపమును ధరించెనట. ఈకుక్కకు ఋVII, 55,2—లో "సారమేయ", యను నామముగలదు, ఈసారమేయము యెర్రగను, ప్రకాశమానముగను గలదట. దీనికోరలు మిక్కిలి తీక్ష్ణమైనకాంతులతో మెరయుచున్న వట. ఈవర్ణనము "శ్వాన", నక్షత్రవర్ణనతో సరాసరి సరిపో వుచున్నది. ఆకాశమందలి నక్షత్రములలోనికెల్ల యీ "శ్వాన", నక్షత్రము మిక్కిలి ప్రకాశమానమైనది. దీనికంటె ప్రకాశ మానమైన నక్షత్ర మింకొకటిలేదు. వాస్తోష్పతికుక్క రూప ముతోవచ్చి ప్రజాపతిశరీరమును కాపాడుచున్నాడను వర్ణన మెంతయు సమంజసముగనున్నది. ఇది మనసిద్ధాంతమును బలపరచుచున్నది.

వీనియన్నిటికంటెను యింకను బలవత్తరమైన ప్రమాణములుగలవు ఋI, 161,13లో "సంవత్సరాంతమందు శ్వానమువచ్చి ఋభువులను (ఋతువులకధిష్ఠానదేవతలను) మేల్కొలిపెను,, అనియున్నది. దీనికర్థమేమి? "శ్వాన,, మనగ గాలి, యని శాయనాచార్యుల వారర్థము జెప్పిరికాని, యిదితప్పు ఋI,105,11–నుగూర్చి శాయనులవారుచేసినవ్యాఖ్య సరిగనున్నది. అచ్చటనేమున్నదనగ:–"యమలోకజలములను దాటివచ్చి శ్వానము తూర్పునకు గన్పడినట' వెంటనే ఆ శ్వానము సూర్యకిరణములలో మునిగిపోయెనట–దీనిభావము స్పష్టమగుచునేయున్నది. అనగ, పితృయానము పూర్తికాగనే వసంతవిషువత్ వద్ద శ్వానము—"శ్వాన్,, నక్షత్రము—గన్పడెననుట స్పష్టము.

ఋగ్వేదములో వర్ణింపబడిన కుక్కలు ఎరుపు, నలుపు, వగైరా రంగులు గలవిగను ప్రకాశమానమైనవిగను, నాల్గు కండ్లుగలవిగను, యమలోకమును యమలోకమార్గమును కాపాడుచున్నవిగను, పాలను వెడల్గ్రక్కుచున్నవిగను, పానము చేయుచున్నవిగను, సంవత్సరమును ఉపక్రమించు(ప్రారంభించు)చున్నవిగను, గన్పట్టుచున్నవి. దీనినిబట్టి గ్రీకు, హిందూ పార్సి, గ్రంథములలో వర్ణితమైన కుక్కలన్నియు ఒకటెనని అర్థమగుచున్నది. అనగ, ఆకాలమున,—యీ జాతులన్నియు ఒకచోటనే కాపురమున్నప్పుడు—శ్వాననక్షత్రము (Dog-Star) వద్ద విషువత్ ఉండగ, నూతనసంవత్సరాదియు, దేవయానమును ప్రారంభమయ్యెడివని మొత్తముమీద సారాంశము

అయితే, యీకుక్కలకు నాల్గు కండ్లెక్కడనుండివచ్చినవి.? "పాలమిన్నేటి" దరినున్న నాల్గు నక్షత్రములే "శ్వాన" నక్షత్రము. ఈనాల్గునక్షత్రములను నాల్గుకండ్లుగపోల్చిరి. ఈ ఈనాల్గుకండ్లును తలమీదనే యుండనక్కరలేదు (ఇంద్రుని కండ్లు శరీరమునందంతటను వ్యాపించినట్లే) యీ కుక్కలకండ్లుకూడ శరీరమందంతటను వ్యాపించియున్నవన్నచో దోష మేమి? ఈకుక్క "నీటిలో" నుండి పుట్టినదనియు, దీనిగృహము ఆకాశమందున్నదనియు, ఇది తనకాంతిచే నలుదిక్కులను వెలింగించుచున్నదనియు అథర్వవేదము VI, 80, 3 ను బట్టి గ్రహింపవచ్చును.

సూర్యునితోకూడ యీ శ్వానముదయించునప్పుడు వసంతోదయమయ్యెను వసంతర్తువు మిక్కిలి ఆనందసంధాయకముగ నుండును. ప్రకృతికాంత నవనవారుణకాంతులతో శోభిల్లుచుండును. సాత్త్వికతేజోనిధియైన విష్ణుమూర్తియందు విశిష్టమైయున్న అనంతకల్యాణ గుణములనుదాల్చి వసంతుడాకాలమున ప్రకృతికాంతతో జగన్మోహనాకారముగ క్రీడసల్పుచుండును

మరియు, యీ శ్వానము దేవయానాంతరమందు—అనగ, సూర్యుడు శరద్విషువత్ వద్దనున్నప్పుడు— సూర్యాస్తమయము కాగనే తూర్పునగన్పట్టును. సూర్యాస్తమానమందు తూర్పుదిక్కున శ్వానముదయించినప్పుడది వర్షాంతమునుదెలుపు ... చేతనే, యీశ్వాననక్షత్రమునకు "వర్ష- ..."

త్రము,, అనికూడ పేరువచ్చియుండును. వర్షాంతమైనను అప్పటి కింకను మేఘములుండియుండవచ్చును. ఉరుములు, మెరుపులతో ఆకాశము భయంకరముగ గన్పట్టియుండవచ్చును ఈరీతిని శ్వానవక్షత్ర మొకప్పుడు సాత్త్వికగుణప్రధానమైన వసంతమును, మరియొకప్పుడు భయంకరరూపమైన వర్షర్తువు సూచించెను

యమలోకద్వారమువద్ద ,,కెర్ బెరోస్,,—,,ఆర్థ్రోస్,,— అను రెండుకుక్కలు గలవని గ్రీకుగాధలలో గలదు. ,,కెర్-బెరోస్,, అనగ ,,శార్వర,, అనియు, ,,ఆర్థ్రోస్,, అనగ ,,వృత్ర,, అనియుశబ్దశాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. అయితే, వృత్రుడీయమద్వారముకడ నేలయుండవలెను? ఈ,,ఆర్థ్రోస్,,-(వృత్రుడు)— ,,హెరాక్లిస్,, చేత చంపబడెనట. దీనిభావమేమి? ఇంద్రశత్రువునకు వృత్రుడనియు, నముచియనియు ననేకపేర్లుగలవు. ఈవృత్రుడు మృగరూపము నధరించి పోరాడెనని ఋగ్వేదములో పలుతావులందు గలదు. ఇంద్రుడీ మృగరూపధారియైన వృత్రుని తలనరికెను. అయితే, రుద్రుడు మృగరూపధారియైన ప్రజాపతి తల నరికెనని పైనచెప్పితిమి. ఈరెండుతలలును (మృగశీర్షములును) ఒక్కటేనా? ఇంద్రుడు నముచితలను యెచ్చటనో దూరప్రదేశములో (పరావతి) నరికెనట; ఎచ్చటనో తెలియదు. కాని, యింద్రుడు నముచితలను నరుకుటచే దేవయానమార్గము ఖాళీయయ్యెనని ఋ X, 73,7 లో గలదు. అనగ, యింద్రుడు నముచి తలను దేవయానద్వారమువద్ద నరికెనని స్పష్టమగుచున్నది. వా

జసనేయసంహిత 10—14 కూడ దీనిని బలపరుచుచున్నది. ఈయజ్ఞములో పురోహితుడొకలోహపుముక్కను పులితోలు తోకప్పి యజమానునిచుట్టుత్రిప్పి, వసంతము మొదలు శిశిరము వరకు ఋతువులపేర్లన్నియుచదివి, తుదకు—„ఇదిగో, నముచితల పారవేయబడినది„, అనిచెప్పి, దానిని దూరముగ పారవేయునట. అనగ, నముచితల సంవత్సరాంతమందు (శిశిరాంతమందు)— పితృయానాంతమందు— దేవయానద్వారము వద్ద నరికివేయుబడినదని భావార్థము దీనినిబట్టి „ఆర్థ్రోస్„- (వృత్ర)— యమద్వారమువద్ద యేలనుండెనో, దానిని „హెరాక్లిస్„ యెట్లుచంపెనో స్పష్టమగుచున్నది. దీనినిబట్టి చూడగ, ఒకనక్షత్రగణమునే కొందరు ఋషులు ప్రజాపతితలతోడను, కొందరు వృత్రునితలతోడను పోల్చిరి. అనేకఋషులనేకరీతులుగ తమగాథలనెల్ల తీసికొనివచ్చి తమ ఋష్టము వచ్చినట్లు యీనక్షత్రముం కంటగట్టుచుండిరనుట స్పష్టము.

గ్రీకు గ్రంథములలో వర్ణింపబడిన „ఆర్థోస్'‚—అను మొదటి కుక్కనుగూర్చి చెప్పితిమి ఇక రెండవ కుక్క పేర „కెర్బెరోస్' దీనిని మృగశీర్షములోనున్న మూడు నక్షత్రములతో (ఇష్వకానక్షత్రములతో) పోల్చవచ్చును. దీనికే మూడు తలల కుక్కయని గ్రీకు గ్రంథములలోగలదు. దీనిని „ఇష్వకా„ తో—అనగ, „త్రిశీర్షా, అని ఋ X, 99, 6 లో వర్ణింపబడినదానితో—పోల్చవచ్చును ఇంద్రుడు మూడు తలలును, ఆరు కండ్లును గలిగినట్టి రాక్షసిని చంపెనని X, 99, 6 లో గలదు. వృత్రాసురుని (ఆర్థ్రోస్) తలను

గ్రీకులు కుక్కగ పోల్చిరి. హిందువులు మృగముగ పోల్చిరి. ఆరీతినే ,,ఇక్ష్వకా'' నక్షత్రములను గ్రీకులు ‹‹ మూడు తలలకుక్క ' గ (కెర్ బెరోస్)—పోల్చిరి. హిందువులు ‹‹ త్రిశీర్షా '' అను రాక్షసిగ పోల్చిరి. ఈరెంటిని చంపిన వానికి ‹ హెరాక్లిస్ ' అని గ్రీకులు పేరుపెట్టిరి; దీనికే హిందువులు ‹ ఇంద్రుడ › ని పేరుపెట్టిరి. మృగశిరానక్షత్రములును శ్వాననక్షత్రములును బహు సమీపమందుండుటచే వానిలో వానికే కొందరు మృగమనియు, కొందరు కుక్కయనియు, అనేకు లనేకరీతులుగ పేర్లు పెట్టియుందురు. కనుక, యీపోలికలను దూరముగనుంచి మొత్తముమీద భావార్థమును గ్రహించుటయే మనకర్తవ్యము.

ఈ పురాణగాథలింకను పూర్తికాలేదు. ఇంద్రుడును నముచియు నొక ఒడంబడిక చేసికొనిరట—‹ రాత్రి పగలుగాని సమయమందునను, తడిపొడిగాని ఆయుధముతోడను ' యింద్రుడు నముచిని చంపవలెనట. ఈ ఒడంబడిక తండ్య బ్రాహ్మణము XII, 6, 8-లో నున్నది. ఇంద్రుడు తుదకు నముచిని ఆప్రకారమే చంపెనట. రాత్రిపగలు—దేవతలకు రాత్రిపగలు కానిసమయమందు, అనగ దేవపితృయానముల సంధికాలములో ఇంద్రుడు నముచిని చంపెను. అనగ, సంవత్సరారంభమందు దేవయాన ద్వారమువద్ద చంపెనని పైనవివరించితిమి. ఇక తడిపొడిగాని ఆయుధ మేది? నీటిపై నురుగు. ఋ VIII, 14, 13లో యింద్రుడు నముచి తలను నీటి నురుగుతో నరికెననివర్ణింపబడియున్నది. ఈనురుగు యెక్కడిది?

దీనిభావమేమి? ఇంద్రుడు నముచిని దేవయాన ద్వారమువద్ద చంపెను. అచ్చటనే పాలమిన్నేరుగలదు. కనుక, యీనుయిగు ఆయేటిలోనిదే. ఆకాశమునంత నొక సముద్రముగను, నక్షత్ర గణములు నందలి నురుగుగను కవులు వర్ణింతురు మహిమ్న స్తోత్రములలో రుద్రుని స్వరూపమిట్లు బహుమనోహరముగ వర్ణింపబడినది.

[నేదం నభోమండల మంబురాశిర్నైతాశ్చతారా నవ
ఫేనభంగా। వియద్వ్యాపీతారాగణగుణిత ఫేనోగమరుచిః।
ప్రవాహోవారాంయః పృషతలఘు దృష్టశ్శిరసితే। జగ
ద్వీపాకారంజలధివలయం తేన కృత। మిత్యనేనైవోన్నేయం
ధృతమహిమదివ్యం తవ వపుః॥

ప్రజానాథంనాథ ప్రసభమభికంస్వాం దుహితరం। గతం
రోహిద్భూతాం రిరమయిషు మృష్యస్యవపుషా। ధనుష్పా
ణేర్యాతం దివమపిసపత్నీకృతమముమ్। త్రసంతం తేఽ
ద్యాపిత్యజతి న మృగవ్యాధరభసః॥]

ఇది జటాజూటమందు గంగను ధరించిన శివునివర్ణనము. రుద్రుని తలమీదనున్న గంగాప్రవాహములోని నురుగులు ఆకాశములోనున్న నక్షత్రములచే నురింతశోభాయమానముగ ప్రకాశించుచున్నవి

ఈశ్లోకమందు రుద్రుడు ప్రజాపతితలను నరుకుటకూడ వర్ణింపబడినది. ఈకథయంతయు ఆకాశమందు వర్ణితమై యున్నదని యీకవి చెప్పుచున్నాడు. కిరాతరూపధారియైన

రుద్రుని (మృగవ్యాధనక్షత్రము) మీదుగ ప్రవహించుచున్న పాలమిన్నేటిచే యీకథ వ్యక్తమగుచున్నది.

మహిమ్న స్తోత్రకారునకే పాలమిన్నేటిలో నురుగులు గా న్పించినప్పుడు వేదకాలమునాటి ఋషీశ్వరులకు గన్పించుట లో నాశ్చర్యమేమి? పార్సీగ్రంథములలో కూడ నిట్టిగాథయే గలదు. కనుక, ఒకప్పుడు మృగశీర్ష నక్షత్రమువద్ద విషువ ముం డెనని యూహించినచో యీ నముచివృత్తాంతమును బహు సమంజసముగ అర్థము చేసికొనవచ్చును. ఇంకొకవిధముగ నముచి వృత్తాంతమునకు భావార్థము కుదురదు.

కిరాతవేషధారియు, భయంకరరూపుడునైన రుద్రుడు మృ గరూపధారియైన ప్రజాపతివెంట బరుగెత్తెనను గాథనెట్లు సమర్థింపవచ్చును రుద్రుడు తనజటాజూటమందు గంగను ధరించెను. ఆతనికి రుద్రభూమియే ప్రియమైనవాసస్థానము. రుద్రుడు కిరాతరూపధారి ఈవర్ణనల నెట్లు సరిపుచ్చవచ్చును. ఆకాశమందు గన్పించుచున్న మృగవ్యాధనక్షత్రమే రుద్రుడు; మృగవ్యాధుడనగ కిరాతుడు. ఈనక్షత్రమునకు పైభాగమం దు గాన్పించు తెల్లనిప్రవాహమే (పాలమిన్నేరే) రుద్రుని జటాజూటమందున్న గంగాప్రవాహము. ఈనక్షత్రము పితృ యాన సమీపమందుండుటచే రుద్రుని ప్రేతభూమి నివాస మును దెలుపుచున్నది ఈమృగవ్యాధనక్షత్రమునకు ముం దున్న మృగశిరానక్షత్రమే మృగరూపుడైన ప్రజాపతి; దీనికి ముందున్న రోహిణీనక్షత్రమే ప్రజాపతి కూతురైన రోహిణి.

ప్రజాపతి కామాతురుడై తన కుమార్తెయైన రోహిణి వెంట బడుచుండగ, వెనుకనుండి క్రోధముతో రుద్రుడు కిరాతరూప ధారియై పరుగెత్తుకొనుచువచ్చి తన బాణముతో మృగరూపుడైన ప్రజాపతితలను నరికెను.

మన సిద్ధాంతమును బలపరచుచు సంవత్సరారంభమును సూచించు కథలింకనుగలవు. "వృత్రుని చంపినచోటనే" సంవత్సరము "సముద్రములోనుండి లేచివచ్చినది" ని ఋ X, 192, 2లో గలదు, ఈరీతిగనే వసంతవిషువత్ మృగశీర్షలో నున్నప్పుడు మృగరూపుడైన ప్రజాపతి సంవత్సరము నుపక్రమించెనని చెప్పవచ్చును. రుద్రుడు ప్రజాపతిని చంపెను. ప్రజాపతి=సంవత్సరము=యజ్ఞము=యివన్నియు సమానార్థకములే. రుద్రుడు యజ్ఞరూపధారియైన ప్రజాపతిని సంవత్సరారంభమందుచంపెను. అందుచేతనే రుద్రునకు "యజ్ఞధ్వంసి" యను పేరువచ్చినది రుద్రుడు దక్షాధ్వరధ్వంసియను పురాణ గాథకలదు. మహాభారతము, సౌప్తికపర్వము 18, 13-14-లో [తతఃసయజ్ఞం వివ్యాధరౌద్రేణహృదిపత్రిణా। అపక్రాంతస్తతో యజ్ఞో మృగోభూత్వాసపావకః। సతు తేనైవ రూపేణది వంప్రాప్య వ్యరాజత్। అన్వీయమానో రుద్రేణ యుధిష్ఠిర నమస్తలే॥—

‹ రుద్రుడు తన బాణముతో యజ్ఞము (ప్రజాపతి) యొక్క హృదయములో గ్రుచ్చెను. ఇట్లుపొడువబడియజ్ఞము నిప్పులు గ్రక్కుచు మృగరూపముతో ఆకాశమున కెగసెను. ఈప్ర

కారముగ రుద్రునిచే తరుమబడుచు యీ మృగము ఆకాశ మందు వెలుగుచున్నది" ఈకారణముచే రుద్రునకు "యజ్ఞ ధ్వంసి" యను పేరువచ్చినది.

కొన్నిచోట్ల ప్రజాపతియేయజ్ఞరూపమునుధరించితనంతట తానే దేవతలకు యజ్ఞార్థమై సమర్పించుకొనెనని వర్ణింపబడి యున్నది. [తండ్యబ్రాహ్మణము: VI1, 2, 1] అంతట దేవ తలు ప్రజాపతిని వారియుదయకాలమందుచంపి యజ్ఞమును చేసిరట. కనుక ప్రతివాఁడును సంవత్సరారంభమందు అశ్వ మేధము చేయవలెనని తై॥ బ్రా॥ 1II, 9, 22 లో చెప్పిరి. ఈకథలయొక్క భావార్థము తెల్లమగుచునేయున్నది. అనగ, మృగశీర్షవద్ద సంవత్సరారంభమయ్యెనని తాత్పర్యము. ఇది కాలసూచకమైనకథ.

పార్శీ గ్రంథములో 'తిస్త్ర్యి' అను నక్షత్రముగలదు. 'తిశ్త్రేయీ' అను పారశీనెల మనమార్గశీర్షమాసముతో సరిపోవుచున్నది. కనుక, యీ 'తిస్త్ర్యి' నక్షత్రమును మన 'ఇక్ష్వకా'లతో పోల్చవచ్చును. ఈపదము 'త్రి—స్త్రి' నుండి యుత్పన్నమైయుండవచ్చును, "త్రిస్త్రి" అనగమూడు నక్షత్రములని అర్థము. ఈమాటక్రమముగ. 'తిస్త్ర్య', 'త్రిస్తర్' అనురూపాంతరములను పొందును. 'తిస్తర్' లేక 'తీర్' అనగ 'బాణ' మని పార్శీ అర్థము. రుద్రుని బా ణములో మూడు నక్షత్రములున్నవని ఐతరేయ బ్రాహ్మణ ములోగలదు. కనుక యీవర్ణనము సరిపోవుచున్నవి.

కనుక పార్శీ భాషలోని 'సిన్త్రియా' అను పదమును, గ్రీకు భాషలోని 'కెర్ బెరోస్' అనుపదమును, సంస్కృతములోని 'త్రిశీర్షా' యను పదమును సమానార్థకములే. ఇవన్నియు మృగశీర్షలోని 'ఇల్వకా' నక్షత్రములను తెల్పుచున్నవి. దీనికే రుద్రుని బాణమనియు, ఓరియానుని మొలపటకాయనియు అనేకవిధమైన గాథలు పుట్టినవి.

వసంతవిషువత్ మృగశీర్షలోనున్నదని చెప్పినచో, మన పురాణములలోని త్రిమూర్తుల గాథలను సరళముగ సమన్వయింపవచ్చును. విష్ణుమూర్తి తన సత్వగుణముచే ఆనంద సంధాయకమగు వసంతర్తువు గల్పించుచున్నాడు రుద్రుడు భీకరాకారమునుదాల్చి ఉరుములను మెరుపులను గల్పించుచున్నాడు. ప్రజాపతి నూతన సంవత్సరము నుపక్రమించుచున్నాడు ఈత్రిమూర్తులును ఒకచోటనే కూడియున్నారు. ఇచ్చోటనేవిష్ణుమూర్తి వరాహమునుచంపెను. (ఋ I,61,7) ఇచ్చోటనే యింద్రుడు వృత్రాసురుని సంహరించెను. ఇచ్చోటనే రుద్రుడు మృగరూపుడైన ప్రజాపతిని వెంటనంటెను ఇచ్చోటనే, దేవపితృలోకమును వేరుచేయు ఆకాశగంగా ప్రవాహము ప్రవహించుచున్నది. ఈనదిని (వైతరణిని) దాటియే యమలోకమునకు పోవలసియున్నది. ఈరీతిని చూచినచో త్రిమూర్తులును యీఒక్క తావుననే చేరియున్నారు. దీనినే తరువాతి కవులు వర్ణించినట్లు, త్రిశిరములుదాల్చిన దత్తాత్రేయుడును, ఆతనివెంట శ్వాన (కుక్క) రూపములధరించిన చతుర్వేదములును, ఇచ్చట మూర్తిభ

వించినవని చెప్పవచ్చును. ఇక్వకములనబడు యీమూడు నక్షత్రములే దత్తాత్రేయుని మూడుశిరములు; ఆవెంటనున్న శ్వాననక్షత్రమే చతుర్వేదములు. ఈగాధలన్నియు యింత మనోహరముగ, ఒక్కచోటనే, కలిసియున్నతావు యీఖగోళమందు మరియెచ్చటను కానరాదు.

# మృగశీర్ష

## ఆరవ యధ్యాయము

—♦ ఓరయన్; అతని మొలపటకా ♦—

హిందూ, గ్రీకు, పారశీకులు మొట్టమొదట కలిసియున్నప్పుడే యీమృగశీర్షానక్షత్రమును పూర్తిగ గుర్తించిరని యీక్రింద జెప్పబోవు గాథలవలన మరింతస్పష్టముగాగలదు. ఈమూడు జాతులవారి గాథలును ఒక్కపోలికగలవే యగుటచే యీసిద్ధాంతము మరింత బలపడుచున్నది. ఒకప్పుడు వసంతవిషువత్ మృగశీర్షానక్షత్రములో నుండియుండిననేగాని యీగాథలకు సరళమైన భావార్థము కుదురదు.

"అగ్రహాయణ" యనుపేరు పాణినికాలములోనుండెనని పైన వివరించితిమి. ఇదియొక నక్షత్రమునకు పేరుగనుండెను. పాణినికంటె పూర్వకాలమందుకూడ యీశబ్ద మీయర్థములో ప్రయోగింపబడియుండవలెనని మన మూహింపవచ్చును. అయినను, యిట్లూహించుట కాధారమేమైన గలదేమో విచారింతము. "హాయన" యను* పదము ఋగ్వేదమందు గానరాకపోయినను అధర్వవేదమందును బ్రాహ్మణములందును యీపదము గాన్పించుచున్నది "హాయన" యనుపదము "హా"= వెళ్లుట యను ధాతువునుండియు, "అయన" శబ్దము "ఇ" లేక "ఐ,,= వెళ్ళుట యను ధాతువునుండియు యుత్పన్నమైనవని పాణిని (VIII, 1,48) చెప్పు

చున్నాడు. ,,హాయన', శబ్దమునకు ,,కాలము'' లేక "వ్రీహి" యనుధాన్యము అని రెండర్థములను పాణిని చెప్పుచు న్నాడు. ఈశబ్దమునకు రెండర్థము లెట్లువచ్చినవో మన మింకొకరీతిగ వ్యుత్పత్త్యర్థమునుదీసివివరింపవచ్చును. ,హాయన శబ్దమును కాలవాచికములగు ,,అయన,, ,,అగ్ర యన,, శబ్దములతోడను, వానినుండి యుత్పన్నమైన పాణ్మా సక్రతువులతోడను పోల్చిచూడవచ్చును. ఎట్లనగ:—సంవ త్సరమును దేవయానమనియు పితృయానమనియు రెండుసమ భాగములుగ విభజించుట బహుప్రాచీనమైన యాచారమను ట కెంతమాత్రమును సందేహములేదు. ఇచ్చట ,,అయన,, శబ్దము కాలవాచికముగ నున్నది. దీనికి ముందు ,,హ,, కా రమును చేర్చినచో ,,హాయన,, యనుపదము వచ్చును; ఇదియే తదుపరి ,,హాయన,, యనుపదముగ మారియుండ వచ్చును. ఈరీతిగ, ,ఐ, లేక ,ఇ, అను ఒక్కధాతువునుండి యే ,,అయన,, ,,హాయన,, శబ్దములు రెండును కాలవాచి కములుగ సిద్ధించుచున్నవి. పాణినివలె రెండుధాతువులను గ్రహింపవలసిన పనిలేదు. ,అయన, శబ్దము క్రమముగ ,హాయన, మైనప్పుడు, ,అగ్రయన, శబ్దముకూడ క్రమముగ ,,అగ్రహాయన,, మగును. ఈరెంటిలో ,అయన, శబ్దము అర్ధ సంవత్సరమును హాయినశబ్దముపూర్ణ సంవత్సరమును సూచిం చుటకు ప్రయోగింపబడి యుండవచ్చును

,అయన, శబ్దము మొట్టమొదట గమనమును అనగ సూ ర్యగమనమును సూచించెను. అటుపిమ్మట కాలవాచిగ మా

నెను. దానినుండికే ''అగ్రయనేష్టు,, లను షాణ్మాసక్రతువులు పుట్టినవి. ఈక్రతువులు సంవత్సరమునకు రెండుసార్లు —అయనారంభములందు—ఆచరింపబడుచుండెడివి. అశ్వలాయన శ్రౌతసూత్రములపై వ్యాఖ్యానముచేయుచు గార్గ్యనారాయణుడు 'అగ్రయన, శబ్దమున కిట్లు అర్థమువ్రాసెను. ''అగ్ర+అయన,, 'అయన, అనగ 'తినుట, యని యర్థము చెప్పెను. అనగ, ఈక్రతువుచేసిన పిమ్మట భోజనముచేయవలెనట. అనగ, క్రొత్తసంవత్సరపుపంటను తినుటకు ముందు యీక్రతువును చేయవలెనని భావము. ''అగ్రయనేష్టు,, లనగ క్రొత్తపంటలనుగూర్చి చేయుక్రతువులని యిటీవల మనువుకూడవర్ణించియున్నాడు కాని, యీవ్యాఖ్యానములు యిటీవల—ఋతువులు మారినపిమ్మట— చేయబడినవి. ఇటీవలివారు సంవత్సరములో మూడుక్రతువులు చేయవలెననిరి. వసంతర్తువులో ''వ్రీహి,, యను ధాన్యముతోడను, వర్షర్తువులో ''శ్యామక,, మను ధాన్యముతోడను క్రతువులు చేయవలెనని యిటీవలి వ్యాఖ్యానలు రెంటిని మూడు క్రతువులుగ మార్చిరి. వసంత, శరదృతువుల ప్రారంభములో—(ప్రాచీన దేవ పితృ యానారంభములో) యీఅగ్రయనేష్టులను చేయవలెనని అశ్వలాయన సూత్రములలో గలదు. తై॥ సం॥ V, 1,7, 3, లో కూడ ''సంవత్సరములలో రెండుపర్యాయములు ధాన్యమును వండవలె,, నని గలదు. దీనిని బట్టికూడ అగ్రయనేష్టులు అసలు రెండేగాని, మూడుకావని స్పష్టమగుచున్నది. ఈక్రతువులపేర్లుకూడ కాలసూచక

ముగనుండుటయేగాక, మనసిద్ధాంతమునకు చేయూతనొసం గుచున్నవి. పాణిని కాలమందు 'అగ్రహాయణ' శబ్దము నక్షత్రనామముగ నున్నమాట నిజమేగాని దీనికి వేదమునందు కూడ నేమైన ఆధారముగలదా? పాణిన్యాచార్యుడు మృగశీర్ష నక్షత్రమునకు పెట్టిన "అగ్రహాయణ" మను పేరు తత్పూర్వమునుండియు పరంపరగ వచ్చుచున్న పేరే యైయుండవలెను. ఏలననగ, ప్రతిఅయనము యేదోయొక నక్షత్రముతో ప్రారంభము కావలెను. కనుక మొదటి (లేక అగ్ర) అయనముతో ప్రారంభమగు నక్షత్రమునకు "అగ్రయన" మను పేరు క్రమేణవచ్చియుండవచ్చును. కనుక 'అగ్రయన' మనగ మొదటి లేక అగ్ర అయనముతో నుదయించు నక్షత్రము అనిపేరు "అగ్రయన" శబ్దము మృగశీర్షానక్షత్రమును దెల్పుచున్నదను ప్రత్యక్షవాక్యము లేమియు వేదమునందింతవరకును గానరాలేదు. ఇంతప్రత్యక్షవాక్యములు లేకపోయినను, తదితరప్రమాణములనుబట్టి యీభావమే నిష్పన్నమగుచున్నది.

ఉదాహరణ:— తై॥ సం॥ VI, 4, 11, 1లో—యజ్ఞవేదికపైకొన్నిపాత్రలనుపెట్టుదురు వీనిలో మొదటిపాత్రకు "అగ్రయన" మనిపేరు అనగ, సంవత్సరమును, లేక అయనమును ప్రారంభించునక్షత్రమునకు అగ్రయనమనిపేరు, దీనిలోనిభావము సువ్యక్తమగుచునే యున్నది. కనుక, పూర్వకాలమున యజ్ఞయాగాదిక్రతువులకొరకై కూడ మృగశీర్షనక్షత్రమును "అగ్రయన"మని పిలుచుచుండెడివారనుట స్పష్టము. తదు

పరి 'అగ్రయనేష్టి'యొక్క మూలార్థము నశించిపోగనే ఈ నక్షత్రముపేరుకూడ వెనుకబడెను. అటుపిమ్మట, 'అగ్రయన' మనగ, ఆక్రతువులను చేయు మాసమునకే పేరయ్యెనుగాని మృగశీర్షనక్షత్రమునకు తరుచుగ ప్రయోగింపబడుచు రాలేదు. కనుక, ఆపేరు మరుపునకువచ్చెను

ఆకాశమందింత మనోహరముగ గన్పట్టు యీ నక్షత్ర గణములపై యెందరెన్నివిధములుగ తమతమ పురాతనగాధలనెల్ల తీసికొనివచ్చి యంటగట్టిరో మనముక్రిందయధ్యాయములో చూచియున్నాము. ఒకానొకడు కాముకుడై యొక స్త్రీ వెంటపరుగెత్తుట, వానినిమరియొకడు వెనుకనుండి బాణముతో కొట్టుట, దానితో వానితల తెగుట; యివి— యీగాధలలోనెల్ల ప్రధానాంశములు. హిందూ, పారశీక, గ్రీకుగాధ లీరీతిగనున్నవి. అదిగాక, 'తేలుకుట్టుటచే ఓరయన్ చనిపోయె'నని గ్రీకులలో నొకకధగలదు. కాని యిది యిటీవల — మేషాదిరాసులు కల్పింపబడినపిమ్మట — పుట్టిన గాధయైయున్నది. దీనిఅర్థమేమనగ:— పశ్చిమమున మృగశీర్ష (ఓరియన్) అస్తమించుచున్నప్పుడు తూర్పుదిక్కువ వృశ్చికరాసి యుదయించుచుండును

ఇక జర్మనుగాధలుకూడ మనసిద్ధాంతమునే బలపరుచుచున్నవి. సంవత్సరాదికిముందు ౧౨ రోజులు (ప్రాతసంవత్సరముముగిసి, క్రొత్తసంవత్సరమింక ౧౨ రోజులుకు రాబోవుననగ) జర్మనీదేశములో, పల్లెటూళ్లలో పగటివేషములువేయుదురట, ఇద్దరుమనుష్యులు ఒకడు జింక (మొగది)

వేషమును, మరియొకరు లేడి (ఆడది) వేషమును వేసికొని వీధులవెంట బయలుదేరుదురట, ఒకదానినొకటి ప్రేమించుచున్నట్లుగ పాటలుపాడుదురట, ఈరెండునిట్లు సల్లాపములాడుచుండగ వెనుకనుండి ఒకవేటగాడువచ్చి బాణముతో వీనినికొట్టునట, దీనిభావమేమి? అనగ 'జింక'తో —'మృగశీర్ష' తో సంవత్సరముప్రారంభమయ్యెనని దీని అంతరార్థము. ఈ కథకూడ మృగరూపుడైన ప్రజాపతిని రుద్రుడుచంపిన కథను పోలియున్నది. ఇది ప్రాచీనపరిస్థితులనుదెల్పు చిహ్నముగనున్నది. ఇక యీ ౧౨ రోజులకర్థమేమి? ఇవి మన హిందువుల 'ద్వాదశాహములే' క్రొత్తసంవత్సరము రాకముందు — క్రొత్తసంవత్సరపు యజ్ఞముప్రారంభించుటకు ౧౨ రోజులు యజ్ఞోపక్రమణమునకై దీక్షితుడు కావలసియుండునని పైన చెప్పితిమి. ఈ దినములు హిందువులకు చాలముఖ్యమైనవి. అదిగాక, సంవత్సరములో సౌరచాంద్రమాసములకుగల భేదము ౧౨ రోజులు ఈ ౧౨ రోజులను అధికముగ గలిపినగాని చాంద్రసంవత్సరము సౌరసంవత్సరముతో సరిపోదు. వీనికే అధికదినములని పేరు. వీనిని ప్రతిసంవత్సరమును కలుపుకొనుచుండుటకంటె, మొత్తముగ పేర్చి ఒకపర్యాయమే "అధికమాసము"గ చాంద్రసంవత్సరమునకు కలుపుచున్నారు. వీనినే పాశ్చాత్యదేశములలో "కుక్క— దినములు" (Dog Days) అనిచెప్పుదురు. అనగ, సంవత్సరాదిని సూచించుటకు శ్వాన (కుక్క) నక్షత్రముదయించినప్పుడు యీదినములకీపేరు వచ్చియుండును. ఈ భావను

ఋగ్వేదములోకూడగలదు "శ్వానము (కుక్క) వచ్చి (ఋతువుల కధిష్ఠానదేవతలగు) ఋభువులను మేల్కొలిపెను," (I, 161, 13,)

ఈరీతిగ, ఒక్క హిందువులగాథలేగాకుండ జర్మన్, గ్రీకు, పారశీక, గాథలుకూడ మనసిద్ధాంతమునకు బలమునిచ్చుచున్నవి. ఆర్యసంతతివారైన పూర్వులందరును కలసి ఒకచోట నున్నప్పుడే యీ గాథలుపుట్టియుండవలెను. ఈ గాథలు పుట్టినపిమ్మటనే, యీజాతులన్నియు వేర్వేరు చీలిపోయి యుండవలెను.

ఆకాశమందు ఓరయాన్ అనువేటకాడు చేతితో నొకదండమును, సింహపుతోలును, ఖడ్గమును, మొలకొకదట్టిని (పటకాను) ధరించి కాన్పించుచున్నాడని గ్రీకు గాథలు చెప్పుచున్నవి. ఈవర్ణనము హిందువులలోను పారశీకులలోనుకూడ గలదేమో విచారించిచూతము. మృగశీర్షానక్షత్రమునకు 'సోమ' దేవత యధిష్ఠానదేవతయని వేదవాఙ్మయమందుగలదు సోమశబ్దమే పారశీకభాషలో 'హోమ' శబ్దమగుచున్నది. 'హోమయాష్ట్' అను పార్సీగ్రంథములో ౨౭వ శ్లోకము సర్వవిధములచేతను మనహిందువుల యజ్ఞోపవీతధారణమంత్రమును పోలియున్నది.

'ఫ్రతే మజ్డో బరత్ (1) పౌర్వనిమ్ (2) ఐవ్యాంఘనెమ్ స్త్రెహ్రె—పైసంఘెమ్ మైన్యు (3) తస్ తెమ్ వంఘుహిమ్ దైనమ్ మజ్డయాస్నిమ్॥'

పౌర్వనిమ్=పురస్తాత్; (2) ఐవ్యాంఘనెమ్ (యజ్ఞోపవీతం) లేక 'కుస్తీ' (3) మైన్యు-తస్ తెమ్=సహజమ్.

ఈవాక్య శ్లోకమున కర్థమేమనగా — 'భగవంతుడా, హోమమునకు ఒకదట్టీయో లేక పటకాయయిచ్చెను ఇది అతనికి సహజమైనదియు, నక్షత్రములతో పొదుగబడినదియు, పురాతనమైనదియునై యున్నది.' ఈదట్టీనే పారశీకులు 'కుస్తీ' యనెదరు. ఇదియొక పవిత్రమైన దారము. దీనిని పారశీకులు నడుము చుట్టునుధరింతురు గ్రీకులువర్ణించిన ఓరియనుని 'పటకా'యే అనగా, మృగశీర్ష నెత్తిపై సరళరేఖగనుండు మూడునక్షత్రములే యీదట్టీ (లేక కుస్తీ) యని తెలిసికొనవలెను. దీనినే భారతీయులు యజ్ఞోపవీతమనిరి.

'మృగశీర్ష'కు 'ప్రజాపతి' యని దేవవాఙ్మయము చెప్పుచున్నది. 'ప్రజాపతి' యన్నను 'యజ్ఞ' మన్నను సమానార్థకమే. ప్రజాపతియొక్క — అనగ 'యజ్ఞ' ముయొక్క - నడుము చుట్టునున్న వస్త్రమునకే యజ్ఞోపవీతమని పేరు యజ్ఞము యొక్క ఉపవీతము యజ్ఞోపవీతము ఉపవీత మనగ వస్త్రము. ఈ వస్త్రమునే మనమిప్పుడు జన్నిదమనెదము బ్రాహ్మణులు ధరించు జన్నిదము నిజముగ ప్రజాపతియొక్క వస్త్రము (ఉపవీతము) నుండియే యుత్పన్నమైనదని యీక్రింది చర్యవలన స్పష్టముగాగలదు.

యజ్ఞోపవీతమనగ=యజ్ఞ+ఉపవీత, దీనికి రెండు విధములుగ అర్థముచెప్పిరి. 'యజ్ఞ' కర్మకొరకై ధరించు వస్త్రము, అనియు, లేక, 'యజ్ఞముయొక్క' వస్త్రము, అనియు రెండర్థములుగలవు. ఈరెండవ యర్థమే యెక్కువగ సమంజసముగనున్నది. 'హోత్రులు' పరమాత్మను 'యజ్ఞ' మని పిలుచు

చున్నారు; యీయజ్ఞముయొక్క ఉపవీతమే యజ్ఞోపవీతము, అని పారిజాతస్మృతి: [యజ్ఞాఖ్యః పరమాత్మాయ ఉచ్యతేచైవహోతృభిః। ఉపవీతంయతోస్యేదం తస్మాద్యజ్ఞోపవీతకమ్॥___

యజ్ఞోపవీతధారణ మంత్రమున కర్థమేమి? 'నేనుసిన్ను యజ్ఞముయొక్క ఉపవీతముతో (అనగ వస్త్రముతో బంధించుచున్నాను., ఈ మంత్రములోని ప్రథమచరణమిట్లున్నది:- 'యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్.' ఈమంత్రము యిప్పుడున్న సంహితలలో నెచ్చటను గానరాదు కాని, యిది బ్రహ్మోపనిషత్తులోగలదు. దీనినే బౌధాయనులవారుకూడ చెప్పిరి. ఈ మంత్రమునకును పారశీకుల 'హోమియాష్టిట్, మంత్రమునకును సంపూర్ణమైన పోలికగలదు. ఈ వస్త్రమునకు 'పురస్తాత్, అనియు, సహజం' అనియు విశేషణములు ప్రయోగింపబడినవి ఈ విశేషణములే పార్శీశ్లోకములో గూడనున్నవి. ఈ 'ఉపవీతము, ప్రజాపతికి పురాతనమైనదియు, సహజమైనదియునై యున్నది. [సహజమనగ-అన్ని యవయవములతో పాటు నిదికూడ సహజముగ పుట్టుకతోడనే పుట్టినదట—ఉదాహరణము కర్ణుని సహజకవచకుండలములు]. ఈరెండు శ్లోకములకుగల యిట్టి సంపూర్ణమైన పోలికకు విశేషమైనగూఢార్థమున్నదనుటకు సందేహములేదు దీనినే గ్రీకులు ఓరయూనుని మొలపటకాయనిరి. ఆర్యసంతతులన్నియు నొకచోటకలిసియున్నప్పుడే యీ భావములు ఇద్దరిలో ప్రబలియుండవలెను.

యజ్ఞోపవీతము పరమమైనది (అనగ గొప్పది) పవిత్రమైనది, ఇది పూర్వకాలమందు (పురస్తాత్) ప్రజాపతితోకూడ సహజముగ (సహజం) పుట్టినది. 'ఉపవీత' శబ్దము వే-(నేయుట) అను ధాతువునుండి పుట్టినది. కనుక దీనికి "వస్త్రము" అని అర్థమేయగునుగాని "దారము" అనిఅర్థము కాజాలదు. మొట్టమొదట, అసలీయజ్ఞోపవీతమనునది నడుముచుట్టు బిగించికట్టిన వస్త్రముగనుండెనేగాని, యిప్పటివలె రెండవ ఎడమభుజముమీదినుండి ధరింపబడిన జన్నిదపుదారముగ లేదు. యజ్ఞోపవీతమనునది వస్త్రమేగాని దారము కాదు. తై॥సం॥ II, 5, 11, 1లో నివీత, ప్రాచీనావీత, ఉపవీత - అనుమూడు యజ్ఞోపవీత ధారణావిధానములు వర్ణింపబడినవి. ఈ మూడు విధములును యజ్ఞోపవీతమునకు వర్తింపవనియు, యజ్ఞకర్మ చేయునప్పుడు ప్రతివారుధరింపవలసిన లేడిచర్మమునకుగాని, వస్త్రమునకుగాని వర్తించవలయుననియు మీమాంసకులు తలంచుచున్నారు. కనుక, పూర్వకాలమందు బ్రాహ్మణులు జింకచర్మమునో లేక వస్త్రమునో నడుమునకు ధరించుచుండిరేగాని యిప్పటివలె దారమును జన్నిదముగ ధరింపలేదని తెలియుచున్నది. సూత్రములలో వర్ణింపబడిన కర్మకాండ విధానముకూడ యీ యూహనుబలపరుచుచున్నది. "ఉపనయన" కర్మలో యీ దారముమాట నిచ్చుటను చెప్పబడలేదు. అశ్వలాయన గృహ్యసూత్రములు-,19,8-10-12 లో అజినం, మేఖల, దండము—యీ మూడే చెప్పబడినవిగాని దారరూపమగు జన్నిదమిచ్చుటను చెప్పబడలేదు. కాని

యీ కాలములో యీ దారమే ఉపనయనకర్మకు ప్రధానాంగముగ గన్పట్టుచున్నది. అయినను, వస్త్రమును ధరించు ఆచారము కు మాత్రము మనముపూర్తిగ వదలివేయలేము. పితరులకు అపరకర్మ చేయవలసివచ్చినప్పుడు యీ మాములు జన్నిదమునకు తోడుగ ఒకగుడ్డముక్క చింపి జన్నిదముగ ధరింతుము. ఇది పైనవివరించిన ప్రాచీనాచారము యొక్క చిహ్నము. బ్రాహ్మణుడు ధరించవలసిన మూడుజన్నిదములలో నొకటి పైబట్ట లేనప్పుడు ఉత్తరీయమునకు ప్రత్యామ్నాయమని దేవలుడు తెలంచుచున్నాడు. [తృతీయ ముత్తరీయార్థం వస్త్రాభావేతదిష్యతే] ఇదియు పూర్వాచారమును సూచించు చిహ్నముగ నున్నది.

యజ్ఞోపవీతమనునది మొట్టమొదట వస్త్రముగ నుండెడిది. స్మృతికారుల కాలమునాటికది జన్నిద (దార) రూపమునకు వచ్చెను. దీనికి మూడుముళ్ళు కలవు.

పారశీకులు తమ "కుస్తీ" ని నడుముచుట్టు ధరింతురు. ఇది గ్రీకుల ఓరమూనునివర్ణనముతో సరిపోవుచున్నది. కాని బ్రాహ్మణులు యెడమభుజముమీదుగ ధరింతురు. దీనికి కారణమేమి? మానుషకర్మలన్నియు "నివీతి" గనే చేయవలెనని తై॥ సం॥ II, 5, 11, 1—లో గలదు; (ఉపవీతికాదు.) "నివీతి, అనగ "మెడలో తావళమువలె వ్రేలాడునట్లు", అని కొందరు వ్యాఖ్యానము చేసిరి. కాని, కుమారిలభట్టుని తాంత్రవార్తిక, (III, 4, 2) ను చూచినచో "నివీతి" అనగ

,,నడుముచుట్టుకట్టుట,, అని కూడ అర్థముకలదు. ,,నడుము నకు బిగించికట్టినచే యేపనినైన చేయుటకు మిక్కిలి అను కూలముగ నుండును,, ని కుమారిలభట్టుకూడ వ్యాఖ్యానము చేసెను. బ్రహ్మసూత్రముల శాంకరభాష్యమునకు వ్యాఖ్య వ్రాయుచు ఆనందగిరి, గోవిందానందు లిరువురునుకూడ యీవిధముగనే చెప్పిరి. [నివీతం కేచిద్గలవేణికాబంధం స్మరంతి। కేచిత్పూర్వ పరికరబంధం। తత్రగలవేణికాబంధో యుద్ధాదన్యత్రనప్రాప్నోతి పరికరబంధస్తు సర్వకర్మ స్వవ్యగ్రతాకరత్వా ప్రాప్తయితి॥]

కాత్యాయన:— పృష్ఠవంశేచ నాభ్యాంచ యధృతం దతేకటిం। తద్ధార్యముపవీతం స్యాన్నాతిలంబనచోచ్ఛ్రితం॥

దేవల:— స్తనాదూర్ధ్వమధోనాభే హనైవధార్యాంగ దాచన॥

పూర్వ మొకప్పుడు బ్రాహ్మణులుకూడ—యిప్పటి పారశీలవలెనే— తమజన్నిదమును నడుముచుట్టు బిగించికట్టుకొ నెడివారని స్పష్టమగుచున్నవి అనగ, యెప్పటి కేపనిచేయు టకైనను సదాసంసిద్ధముగ నుండునట్లు, తమజన్నిదమును నడుమునకు దట్టించి కట్టుకొనియుండెడివారని తాత్పర్యము. పారశీకులయొక్కయు, బ్రాహ్మణులయొక్కయుజన్నిదములు ఆకాశమందు వెలుగుచున్న ప్రజాపతియొక్క యజ్ఞోప వీతమును (లేక ఓరయానుని యొక్క మొలపటకాను) సర్వ

విధముల పోలియున్నవి. ఆదియందు నడుమునకు దట్టించి కట్టుకొన్న వస్త్రము, క్రమేణ యేరీతిగ యిప్పటికి జన్నిద రూపముగమారె, భుజమెక్కె-నో యిట వివరించుట అనవసరము.

ఓరయానుని యొక్క- వేషమింతటితో పూర్తి కాలేదు. నడుమునకు పటకా, చేతిలో దండము, చర్మము—యీ మూడును కూడ ఓరయానుని వేషములో చేరికవే. ఉపనయనములో వటువునకు కూడ యీమూడును అవుసరమే. వటువునడుమునకు గడ్డితో చేసినత్రాడును—మేఖలను—గట్టుదురు. ఈమేఖలకు బొడ్డుపైన మూడుముళ్ళు వేయుదురు. ఈమేఖలయే ఓరయానుని మొలపటకా; ఈమూడుముళ్లను యీపటకాలోనున్న మూడునక్షత్రములను సూచించును. [149 మేఖలాం త్రిరావర్త్యనాభిప్రదేశే గ్రంధిత్రయం కుర్యాత్ ॥ ] అదిగాక, యీ మేఖలకు ముళ్ళు వేయునప్పుడు "నీవు సోముని ముడివి,,— (సోమస్యనీవిరసి)— అని చెప్పుచు వేయవలెనట. సోము డనగ మృగశీర్షనక్షత్రమున కధిష్ఠాన దేవతయని పైన చెప్పియే యుంటిమి దీనినిబోలిన మంత్రమే పారశీకుల గ్రంధములలోకూడ కలదు కనుక, యివి మృగశీర్షలో నున్న మూడు నక్షత్రములను సూచించుచున్నవనుట కెంతమాత్రమును సందేహము లేదు.

ప్రతివటుడును ఉపనయన కాలమందు పాలాశదండమును ధరింపవలెను. ఓదండమా! యీయజ్ఞము పూర్తియగువరకు

నీవు గట్టిగనిలువబడి నన్ను పాపమునుండి రక్షింపుము [వాజసనీయసంహిత] అనుమంత్రమునుచదువుచుయీదండమును వటుడు ధరింపవలెను. ఇదికూడ యజ్ఞరూపుడైన ప్రజాపతి నే సూచించుచున్నదని చెప్పవచ్చును.

వటువుధరింపవలసిన వస్తువలలో మూడవది జింకతోలు న్యాయప్రకారము వటువునుపూర్తిగ జింకతోలుతో కప్పివేయవలెను కాని దీనికి ప్రత్యామ్నాయముగ కొంచెము జింకతోలును జన్నిదమునకు కట్టుచున్నాము

మేఖల, దండము, అజినము—యీమూడును వటుని వేషములో ప్రధానాంశము ఈ వటుని వేషము ప్రజాపతివేషముతో సర్వవిధముల సరిపోవుచున్నది. అట్లుండుటన్యాయమే ఏలననగ:—ప్రజాపతి బ్రాహ్మణులలో మొదటిబ్రాహ్మణుడు, కనుక బ్రాహ్మణుడుకాదలచిన ప్రతివాడును యీ ప్రజాపతి వేషమును ధరించవలెననుట బహుసమంజసముగ నున్నది ప్రజాపతి మృగరూపమును ధరించెను, కనుక వటుడుకూడ శరీరమందంతటను మృగచర్మమును ధరించవలెను, ప్రజాపతి నడుమునకు దట్టీని కట్టుకొనెను, కనుక వటుడుకూడ నడుమునను 'మేఖల' ను ధరించవలెను. ప్రజాపతి మొలదట్టీలో మూడు నక్షత్రములు గలవు, కనుక వటునిమేఖలలోకూడ మూడుముళ్ళుండవలెను. ప్రజాపతిచేతిలో దండమున్నది; కనుక వటుడుకూడ (పాలాశ) దండమును ధరించవలెను. ఈవిధముగ, యీరెండు వేషములును తూచినట్లు సరిపోవుచున్నవి.

ఓరయానుని వేషమునకును, వటుని వేషమునకును రెండు భేదములు మాత్రమున్నవి. ఓరయానుని చేతిలో ఖడ్గమున్నది. వటుని చేతిలో ఖడ్గము లేదు. ఓరయానుడు సింహపుతోలు కప్పుకొనెను. కాని వటుడు జింకతోలు కప్పుకొనెను. మొదటి భేద మెట్లువచ్చెనో తెలియదు; కాని, రెండవ భేదమును మాత్రము సమర్థింపవచ్చును. వటుడు మృగాజినమును ధరించవలెనుగద; ఋగ్వేదములో "మృగ" అనగ "సింహము" లేక "జింక" అని శాయనాచార్యుల వారు వ్యాఖ్యచేసిరి కనుక, గ్రీకులు సింహపుతోలని అర్థముచేసికొనిరి; మనవారు జింకతోలని అర్థముచేసికొనిరి. ఈరీతిగ, అన్ని పోలికలును తూచినట్లు సరిపోవుచున్నవి.

మృగశీర్షానక్షత్రమును గుర్తించకపూర్వము మనయార్యులు వస్త్రములను ధరించుట యెరుగరని అర్థముకాదు. నిజస్థితి యేమనగ:— తాము ఆకాలమునాడు ధరించుచున్న వేషమునే ప్రజాపతికికూడ అంటగట్టిరని దీనిభావార్థము.

మనయెదుట యిన్ని ప్రమాణములు గన్పట్టుచుండగ, మనసిద్ధాంతమున కెంతయో బలముచేకూరుచున్నది. గ్రీకులు, పారశీకులు, హిందువులు, జర్మనులు—మొదలగు ఆర్యసంతతులవారందరు ఒకప్పు డొక్క—తావుననే యుండిరనియు, ఆకాలముననే యీగాథలన్నియు పుట్టినవనియు, తదనంతరమే వారందరు చీలిపోయి వివిధప్రాంతములకు పోయిరనియు దీనివలన సిద్ధించుచున్నది.

గ్రీకుల ,,ఓరయాన్,, పదము, భారతీయుల ,,మృగశీర్ష, కును యిన్ని పోలికలున్నప్పుడు, యీపేర్లుమాత్రమేల భిన్నముగ నుండవలెను? బహుశః ,,ఓరయాన్,, అను గ్రీకుశబ్దమును, ,,అగ్రయన,, అను సంస్కృతశబ్దమును ఒక్కమూల ధాతువునుండియే యుత్పన్నమైయుండుటకు చాల అవకాశములుగలవు. సంస్కృతములోని ,,ఆ,, కారము గ్రీకుభాషలో ,,ఓ,, కారమగును. ఇంతవరకు నిర్వివాదమే కనుక, ,,ఆగ్రయన,, అనుసంస్కృతపదము గ్రీకుభాషలో ,,ఓగ్రయన,, అగును. అయితే ,గ, కారమెట్లులోపించును? శబ్దాదియందు ,గ,కారములోపించునని వ్యాకరణవేత్తలు చెప్పుచున్నారు. కాని, శబ్దమధ్యమందు—,ర, కారమునకు పూర్వమందు-,గ, వర్ణములోపించునా లోపించదాయనునదే చర్చనీయాంశము. తదితరభాషలలో లోపించునమట కనేక నిదర్శనములు గలవుగాని సంస్కృతగ్రీకుభాషలమధ్య లోపించునని ఖండితముగచెప్పుటకు తగినపంతసామర్థ్యము నావద్ద లేదు. ,గ,వర్ణము,య,వర్ణమైలోపించినను లోపించవచ్చును. అయినను, దీనిని శబ్దశాస్త్రవేత్తలే నిర్ణయింతురుగాక ఇట్లు ,గ, వర్ణములోపించినచో ,ఓగ్రయన, నుండిఓరయన్ అను పదములభించును

మన ప్రధానసిద్ధాంతమంతయు కేవలము శబ్దసాదృశము మీాదనే ఆధారపడియుండలేదుగనుక, దీనివిషయమై మన మంతగ చర్చింపనవసరము లేదు ఇంతకంటె మనకు బలవత

రమైన ప్రమాణములేగలవు. వాని నెల్లపైన వివరించియే యుంటిమి. వానికి తోడుగ యీశబ్దముల వ్యుత్పత్తికూడ సరిపోవునేమో చూడవలసినదని సూచించుచున్నాను. ఈపనిని శబ్దశాస్త్రవేత్తలు నెరవేర్చినచో మనసిద్ధాంతమునకు మరింత బలముకలుగును

కనుక, పూర్వమొకప్పుడు ఫాల్గుణపౌర్ణమినాడు హిమసంక్రమణమువద్ద సంవత్సరము ప్రారంభమయ్యెనని చెప్పుతైత్తి॥ సం॥ వాక్యమును బలపరుచుచు సమస్తఆర్యసంతతివారి ప్రాచీనగాథలును నిర్దుష్టమైన సాక్ష్యమునిచ్చుచున్నవి. ఇన్ని పురాణగాథలమీదను, పూర్వాచారములమీదను ఆధారపడియున్న సిద్ధాంతమునెల్లరకును అంగీకారమై యుండవలెను. ఈగాథలనన్నిటిని యింతకంటె యెక్కువ సరళముగను, సులభముగను, సమంజసముగను సమన్వయింపగల మరియొకసిద్ధాంతము బయలువెడలువరకు మనసిద్ధాంతమే నిలిచియుండవలెను

కృత్తికలు ప్రథమనక్షత్రములని చెప్పువాక్యములు అతిప్రాచీనములగు వేదములందెచ్చటను గానరావని మాక్సిముల్లరు పండితుడు ఆక్షేపించెను. నిజమే; మృగశీర్షానక్షత్రము ప్రథమనక్షత్రమైయున్న కాలములో వెలువడిన ప్రాచీనవేదములందు “కృత్తికానక్షత్రము ప్రథమనక్షత్రము”ను వాక్య మెట్లుగనబ్బట్టగలదు? మాక్సిముల్లరుపండితుడు కృత్తికలతోడనేనిలువక, యింకను పైకిపోయి చూచియుండినచో యిట్టి

యాక్షేపణ చేసెడివాడు కాడు. ""శ్వాసము" (కుక్క) సంవత్సరాంతమందు ఋభువులను మేల్కొలిపెను" అను వాక్యమునకు అర్థము చెప్పుటలోకూడ మాక్సిముల్లరు మొదలగు పండితులు ఉక్కిరిబిక్కిరి కావలసిన అవసరము లేకపోయెడిది.

# మృగశీర్ష

## ఏడవ అధ్యాయము

### —♦ ఋభువులు: వృషాకపి ♦—

మన ప్రాచీనపుటార్యుల కెంతమాత్రమును ఖగోళశాస్త్ర జ్ఞానము లేదని కొందరాక్షేపించుచున్నారు. ఇప్పుడున్నన్ని యంత్రములు పూర్వము లేవన్నమాట నిజమే. కాని అంత మాత్రముచేత మనయార్యులకు సూర్యచంద్రాదులును ఉష స్సును తప్ప యింకనేమియు తెలియనే తెలియవనుట గొప్ప పొరబాటు. నక్షత్రములు, అయనములు, మాసములు, సంవత్సరములు మొదలగుఖగోళశాస్త్రాంశములు తెలియనే తెలియవనుటఅతిసాహసము. ఋగ్వేదమునందుకావలసినన్ని నక్షత్రముల పేర్లున్నవి సూర్యచంద్రాదుల గమనముచేత ఋతువులు గలుగుచున్నవని ఋగ్వేదమందుగలదు. "సంవ త్సర" మను కాలమానమును, దానియందలి దినములసం ఖ్యయు ఋగ్వేదమునాటికే మనయార్యులు గుర్తించిరి. అయనములుకూడ అప్పటికే గలవు. విషువనులవద్ద ప్రారం భమగు దేవపితృయానములను గూర్చిన ప్రశంస ఋగ్వేద మందు గలదని యిదివరకే వివరించియుంటిమి. ఋI, 25,8 లో "అధికమాసము" కూడ గలదు. సూర్యుడు ప్రయాణ ముచేయుటకై వరుణదేవుడు వెడలుపైనబాట నొకదాని

నేర్పరచెనని ఋI, 24,8 లో గలదు ఈబాటలోనే ౨౭ నక్షత్రములు గలవు. ఈ ౨౭ నక్షత్రములును సూర్యునిబాటలోని ''మైలురాళ్ళు,, ని మాక్సిముల్లరు పండితుడు వర్ణించియున్నాడు ఈబాటనే మన మిప్పుడు 'రాశిచక్ర' మనుచున్నాము. ఋ I, 41,4 లో వర్ణింపబడిన ''ఋత,, యను బాటకూడ యీరాశి చక్రమునే సూచించుచున్నది. ఖగోళమందు ప్రధానముగ గన్పట్టు జ్యోతిర్మూర్తులన్నియు సాధారణముగ యీ బాటను తప్పిపోకుండ, యీబాటవెంటనే ప్రయాణముచేయుచుండుటచే యీబాటకు ''ఋత,, మను పేరు సార్థకమయ్యెను. అన్ని జ్యోతిర్మూర్తులకును యిదియే క్రమమైన (ఋత) మార్గము. ఇదిగాక, యీరాశిచక్రము ఖగోళమధ్యరేఖతోడను, భూగోళముయొక్క యిరుసుతోడను సమముగనుండక కొంచెము వంగియున్నదను నంశమునుగూడ ఋగ్వేదమునాటి యార్యులెరుంగుదురని ఋI,110,2—వలనను, ఋX, 86,—4 వలనను తెలియుచున్నది. ఇదిగాక, ''సప్తఋషు,, లన బరగు నక్షత్రకూటముకూడ వారికి తెలియును. ఋI, 24,9 లో— నుదహరింపబడిన ''శత—భిషక్,, అనుపదమునుబట్టి శతభిషక్ లేక శతతార యను నక్షత్రగణముకూడ వారికెరుకయేయని తెలియుచున్నది.

ఋగ్వేదము ౫ వ మండలము ౪౦ వ ఋక్కులో అత్రి మహర్షి మొదట సూర్యగ్రహణమును చూచెనని వర్ణింపబడియున్నది. ఈ సూర్యగ్రహణమునుగూర్చియే సాంఖ్యా

యనము 24–3 లోను, తాండ్యబ్రాహ్మణముIV,5,2,6,14 లోనుకూడ వర్ణనగలదు. ఈ సూర్యగ్రహణము శరద్విషువత్తుకు 3 దినములు ముందుగనచ్చెనట. ఈ గ్రహణము పూర్ణగ్రహణమట సూర్యుడుపూర్తిగ కప్పబడి పోవుటచే పగలే నక్షత్రములుకూడగన్పట్టెనట ఈ కారణముచేత నిదిలోకమునకెంతను మహావిచిత్రముగ గన్పట్టియుండును అత్రిమహర్షి యీ గ్రహణమును "తురీయబ్రహ్మ" చే తెలిసికొనెనని ఋవ శ్లోకములో గలదు. "తురీయబ్రహ్మ" యనునర్థమేమి? అనగ, "తురీయ" యను యంత్రసాధనముచే అత్రిమహర్షి దీనిని తెలిసికొనెనని అర్థముచేయవచ్చును, "తురీయ" యనగ "వలయములో నాల్గవభాగముగ నున్న యంత్రసాధనము"




అని యిటీవలి జ్యోతిష్యగ్రంథములలో-సిద్ధాంత శిరోమణి XI, 15లో–గలదు. "బ్రహ్మ" యనగ "సాధనము" అను అర్థమును శాయనులవారే ఋI1, 2,7 లో చేసి యుండిరి. కనుక "తురీయబ్రహ్మ"-యనగ "తురీయ యను యంత్ర

ముయొక్క సహాయముతో—అనిఅర్థము చెప్పవచ్చును. దీనిని బట్టి యిప్పుడున్న క్వాడ్రెంటు (Quadrant) అను యంత్రము అప్పుడును గలదని అర్థముకాదు. కేవల మిదే కాకపో యినను యిట్టిమాదిరిదే బహుసులభమైన యొకానొక సాధనము అప్పుడుకూడ నుండియుండవచ్చును

వేదకాలమునాటి ఋషులు గ్రహములను గుర్తించలేదని కొందరాక్షేపించిరి. ఈయాక్షేపణను జూచినచో యెట్టివానికైనను నవ్వురాకమానదు. ఖగోళమందు నక్షత్రములను, వానిగమనములనే గుర్తించిన ఋషులు వీనియన్నిటికంటె మిక్కిలి ప్రకాశమానముగ వెలుగుచుండు శుక్రుడు, బృహస్పతి, శని, మొదలగుగ్రహములను గుర్తించలేదన్నచో నెంత హాస్యాస్పదముగ నుండును? ఒకప్పుడు సాయంకాలమందు పశ్చిమమునను, మరియొకప్పుడు ప్రాతఃకాలమందు తూర్పునను గాన్పించుచు మిక్కిలిప్రకాశమానముగ వెలుగొందు శుక్రగ్రహమును యెట్టివారైనను గుర్తింపకమానరు. బ్రాహ్మణములకాలములో గ్రహములు గుర్తింపబడిన వనుట కెంతమాత్రమును సందేహములేదు. తై॥ బ్రా॥ III, 1,1,5 లో—“బృహస్పతి మొట్టమొదట తిష్యానక్షత్రమువద్దపుట్టె” నని యున్నది. [బృహస్పతిః ప్రథమం జాయమానః తిష్యం నక్షత్రం ప్రాదుర్బభూవ] అటుగాక, ఋ VI, 50,4లో కూడ యిట్టివచనమే గలదు. [బృహస్పతిః ప్రథమం జాయమానో మహోజ్యోతిషః పరమేవ్యోమక్ ] ఇప్పటికిని బృహస్పతి

తిష్య (అనగ మృగశీర్ష) లోనికి వచ్చినప్పుడు శుభలగ్నమని జ్యోతిష్కులు తలంచుచున్నారు.

ఋ III, 32—2; IX, 46—4—లలో ,,శుక్ర'', ,,మంథిన్,, అను రెండు గ్రహములు చెప్పబడినవి. వీనికర్థమేమి? ఇవి యజ్ఞవేదికపై నమర్పబడిన పాత్రలపేర్లని వ్యాఖ్యాతలు చెప్పిరి. కాని యజ్ఞకర్మలన్నియు సూర్యుని గమనమునకు సరియైన నకలని రెండవ యధ్యాయములో విశదీకరింపబడియేయున్నది. కనుక, యీపాత్రలపేర్లుకూడ అసలు ఆకాశమందుండు గ్రహాదులయొక్కయు, నక్షత్రములయొక్కయు పేర్లనుబట్టియే వచ్చుచుండును. తై॥ సం॥ లో యీపాత్రలు— ,,శుక్రునియొక్కపాత్ర,, ,,మంథిన్,,యొక్కపాత్రయని స్పష్టముగ విప్పిచెప్పబడియున్నది. కనుక, ఆకాలమునాటికే శుక్రుడు, మంథిన్ మొదలగు గ్రహములు కనిపెట్టబడినవని సిద్ధించుచున్నది.

ఋ ౧౦ వ మండలము. ౧౨౩ వ ఋక్కులో యింతకంటె ప్రత్యక్షమైన ప్రమాణముగలదు. ఈఋక్కు ,,వేన,, యను దేవతనుగూర్చి చెప్పబడినది. ,,వేన' శబ్దము ,,వేన్,,= ప్రేమించుట యనుధాతువునుండి యుత్పన్నమైనదని యాస్కాచార్యులవారు తమనిరుక్తమందు (10—38) చెప్పియున్నారు. శుక్రగ్రహమునకు గ్రీకుభాషలో ,,వీనస్,, అనిపేరు. ఈగ్రహము ప్రేమాధిష్ఠాతయగు స్త్రీదేవతయని గ్రీకుపురాణములు చెప్పుచున్నవి. కనుక, ఋగ్వేదములో ,,వేన,,యని

చెప్పబడినగ్రహమును, గ్రీకులలో ,,వీనస్,, అని చెప్పబడిన గ్రహమును ఒక్కటే. ఈ రెండుపేర్లును శుక్రగ్రహమునే సూచించుచున్నవి. శుక్రగ్రహమునకు ,,వీనస్,, లేక ,వేన, యను పేరు ఆర్యసంతతులందరును వేర్వేరుతెగలుగ చీలిపోకమునుపు పెట్టినపేరైయుండవలెను. ఈపేరే—యీయర్థముతోడనే— ప్రేమస్వరూపిణియగు గ్రహమను నర్థముతోడనే యిప్పటికిని గ్రీకుభాషలో నిలిచియున్నది. కాని, సంస్కృత భాషలో యీ పేరును, దానిననుసరించి యీయర్థమును—చాలవరకు స్మృతిపథమునుండి తప్పిపోయెను. కాని, ఋగ్వేదములో యీఒక్కప్రదేశములోమాత్రము (X, 123) యెట్లో నిలచి యున్నది. ఈ,,వేన,, శబ్దము శుక్రగ్రహమునే సూచించుచున్నదనుట కింకొకప్రబల నిదర్శనముగలదు. యజ్ఞములో యీ ,వేన, మంత్రమునుచదువుచు యాజ్ఞికుడు శుక్రపాత్రను చేతిలోయెత్తి పట్టుకొనును. ఈక్రియ ,వేన, శబ్దమునొక్క నిజార్థమును దెలుపుచున్నది అయితే, యీశుక్రగ్రహమును హిందువులు పురుషునిగను గ్రీకులు స్త్రీనిగను భావించుచున్నారు. ఈలింగభేదమునెట్లు సమర్థింపవచ్చును? దీనినంతగ మనముపాటింపనక్కరలేదు. ఇట్టి లింగభేదములు తరుచుగ సంభవించుచునేయున్నవి. ఉదాహరణ:—చంద్రుని మనము పురుషునిగ భావించుచున్నాము; కాని, పాశ్చాత్య దేశస్థులు స్త్రీగ భావించుచున్నారు. కనుక, లింగభేదమంతపాటింపదగినదికాదు.

దీనిని బలపరచుట కెంకను కొన్ని ప్రమాణములుగలవు. ,,వీనస్,, నకు ,,క్యూప్రిస్,, అను నామాంతరము గ్రీకుభాషలో గలదు ఈ ,,క్యూప్రిస్,, శబ్దము ,,శుక్ర,, యను సంస్కృతశబ్దము నుండియే వచ్చినదని చెప్పవచ్చును. ,శుక్ర, శబ్దములో మొదటనున్న ,,శ,, వర్ణము కొన్నిసూత్రముల ననుసరించి గ్రీకుభాషలో "క"వర్ణముగ మారును. మఱియు శబ్దమందున్న 'క్ర, యనునది ,ప్ర, గ మారును. ఈ ప్రకారము సంస్కృత ,,శుక్ర,,గ్రీకు,,క్యూప్రిస్,,గ మారును. (ఈమార్పు శబ్దశాస్త్రవేత్తలకు సువిదితమే.) ఈరీతిగ ,వేన, శబ్దమునుండి "వీనస్,, శబ్దమును; ,,శుక్ర,, శబ్దమునుండి ,,క్యూప్రిస్,, శబ్దమును పుట్టినవి. ఇవన్నియు శుక్రగ్రహమునకు పేర్లు.

వేదకాలమునాటి ఋషులకు ఖగోళశాస్త్రములోని యంశము చాలవరకు తెలియుననియే సిద్ధించుచున్నది (౧) నక్షత్రములు (౨) సూర్యచంద్రాదుల గమనము చేగలిగిన ఋతుభేదములు (౩) సంవత్సరము, అందలి దినములసంఖ్య, (౪) అయనములు; (౫) విషువనులు, (౬) సౌరచాంద్రమానములు-అధికమాసము (౭) "ఋత" యని చెప్పబడిన రాశిచక్రము (౮) రాశిచక్రముయొక్కవంపు (౯) సప్తర్షిమండలము, శతభిషక్ తారలు (౧౦) సూర్యచంద్రగ్రహణములు (౧౧)ఖగోళాంశమును గుర్తించుటకు కావలసిన యంత్ర సాధనములు (౧౨) గ్రహములు—ఇత్యాదిజ్యోతి

షాంశములు ప్రాచీన వేదకాలమునాటి యార్యులకు తెలి యుననుటలో సందేహమేమియు లేదు. సంవత్సరములయొ క్కయు, మాసములయొక్కయు ప్రారంభములను వారు నక్షత్రములచే గుర్తించుకొనెడివారు ఏనెల ఏనక్షత్రముతో ప్రారంభమగునో, యేఋతువు ఎప్పుడు ప్రారంభమగునో—యే అయనము యే విషువత్ ఎప్పుడు ప్రారంభమగునో యివన్నియు వారు గుర్తించుకొనియేయుండిరనుటలో సందే హ మెంతమాత్రమును లేదు. ఈ విషయమునింతటితో ము గించి యిక—

ఋ I,161,13ఋక్కునుగూర్చి యిప్పుడు విచారింతిము. 'సంవత్సరాంతమందు శ్వానము (కుక్క) వచ్చి ఋభువులను మేల్కొలిపెను.' దీనిభావమేమి? ఋభువుల నగ ఎవరు? యాస్కాచార్యులవారు తమనిరుక్తము 11, 15, 16 లో-ఋభు-విభ్వన్-వజ-యను మువ్వురు ఋభువులుగల రని చెప్పిరి వీరు మువ్వురును సుధన్వుని కుమారులట. వీరు దేవతల కత్యంతప్రీతికరమైన కార్యములొనర్చుటచే, దేవతలు చాలమెచ్చి వీరికి అమర్త్యత్వమును, యజ్ఞములలో హావిర్భా గములను యిచ్చి చాల గౌరవించిరట. వీరుచేసిన మహా త్మ్యములను వర్ణించు ఋక్కులనేకము ఋగ్వేదమందు గలవు, 'ఋభువులు' 'సంవత్సరము' తో కలిసి మెలిసి పనిచేయునట్లు వర్ణింపబడినవి వీరు సంవత్సరాంతమందు తమ పనిని ప్రారంభించి, సంవత్సరము పొడవునను గొప్ప

లను (అనగా సూర్యకిరణములను) కాపాడుచుందురట. ఋభువులు సంవత్సరము పొడవునను పనిచేసిసంవత్సరాంతమందు ౧౨ దివములు సూర్యుని (అగోహ్య) యింటిలో విశ్రమింతురని ఋ IV, 33-7 చెప్పుచున్నది. ఋభువులు సూర్యునకు 'అంతేవాసు' లని (అనగ శిష్యులు-లేక-యింటిప్రక్క-వారని) ఐతరేయ బ్రాహ్మణము III, 30 లో వర్ణింపబడియున్నది. ఋభువులు చేయవలసిన పనిని ఉషస్సే చేయుచున్నదని ఋ IV, 51, 6 లో గలదు. దీనినిబట్టి ఋభువులనగ సూర్యకిరణములని యాస్క, శాయనాచార్యులిరువురును తలంచుచున్నారు, అట్లయినచో, ఋభువులు ముగ్గురన్నదమ్ములను దానికర్థమేమి? కనుక మొత్తముపై ఋభువులనగ సూర్యకిరణములనియేగాక, మూడు ఋతువులని కూడ పాశ్చాత్యపండితులు తలంచుచున్నారు. ఋభువులు ఋతువులతోకూడ యానందించుచున్నారని ఋ IV, 34, 2 లో గలదు. ఇది పాశ్చాత్య పండితుల యూహను బలపరుచుచున్నది. మూడు ఋతువులననుకరించు ముగ్గురు ఋభువులును సంవత్సరము పొడవునను దేవకార్యములదీర్చుచు సంవత్సరాంతమందు ౧౨ దినములు సూర్యుని గృహములో విశ్రమించుచున్నారు. "వీరిచ్చట ౧౨ దినములు బహు ఆనందముతో కాలముగడిపెదరు. అటుపిమ్మట వారుమరల తమపనికి ఉపక్రమింతురు. మరల భూమి క్రొత్త ఫలములనినును; మరల ప్రవాహములు నూతన జలములతో ప్రవహించును; ఆకాశమందు మరల గ్రహములుపుట్టును.

అధోలోకమందు జలము లుద్భవించును.] అటుపిమ్మట—ఋ I, 161, 13—ఋక్కు వచ్చుచున్నది, [సుషుప్వాంసఋభవస్తదపృచ్ఛతాగోహ్యకయిదంనో అబూబుధత్ । శ్వానం బస్తోబోధయితార మబ్రవీత్సంవత్సర యిదమద్యావ్యఖ్యత॥

౧౨ దినముల విశ్రాంతియు, నిద్రయునైన పిమ్మట ఋభువులు మేల్కొలుపబడినవై సూర్యుని యిట్లు ప్రశ్నించుచున్నవి:— "ఓ అగోహ్య' (సూర్యా!) మమ్మల నెవరు మేల్కొలిపిరి", "మిమ్ములను శ్వానము (కుక్క) మేల్కొల్పినది" నిసూర్యుడు(మేక)ప్రత్యుత్తర మిచ్చెను. (ఋభువులు విశ్రమించు యీ౧౨దినములును సౌరచాంద్రమానములకు గలభేదమని గుర్తుంచుకొనవలెను.)

ఈశ్వాన మననేమి? శ్వానమనగ 'గాలి' యని శాయనులవారు తలంచుచున్నారు ఇట్లు చెప్పుట కాధార మెచ్చటను కానరాదు. ఋభువులు ఋతువుల కధిష్ఠాన దేవతలని పైన నిరూపించితిమి. వీరు సూర్యునితో బాటు సంవత్సరము పొడవునను కష్టపడి పనిచేసిరి. కాని. సౌరచంద్రమానములకు ౧౨ దినములు భేదముగలదు. ఈ ౧౨ దినములును అధికదినములు—ఇవి క్రొత్త సంవత్సరమునకును చెందవు. పాతసంవత్సరమునకును చెందవు. కనుక, తటస్థముగ మధ్యనున్న యీ ౧౨ దినములలో ఋభువులు (ఋతుదేవతలు) కూడ తమపనిని విరమించి సూర్యుని యింటిలో హాయిగ విశ్రాంతి గైకొనుచున్నారనుట యెంతయు సహజ

ముగనున్నది. ఈ గాథకిట్టి సరియైన భావార్థముకుదురుచు న్నప్పుడు, యీఋభువులను మేల్కొలిపిన కుక్క ఆకాశ మందొక నక్షత్రమైయుండవలెననుట కెంతమాత్రమును సం దేహము లేదు. ఈనక్షత్రము క్రిందటి యధ్యాయములో వర్ణింపబడిన "కుక్క-నక్షత్రము" (శ్వాననక్షత్రము) గాక మరియేదికాగలదు? సంవత్సరాంతమందు- అనగ ఋతువులు పూర్తియైన పిమ్మట-అనగ విషువత్తో ప్రారంభమైన సంవత్సరాంతమందు-అని ఇచ్చట అర్థము వసం తర్తువుయొక్క ప్రారంభమందు గాన్పించు 'కుక్క' యీ శ్వాననక్షత్రమే. కనుక. ఋభువులను గూర్చిన యీ గాథ పుట్టినప్పుడు వసంతవిషువత్ మృగశీర్షలోనుండి తీరవలెను, అనగ, హిమసంక్రమణము ఫాల్గుణ పౌర్ణమినాడు వచ్చితీర వలెను, మృగశీర్ష ప్రథమ నక్షత్రమైయుండితీరవలెను—అని సిద్ధించుచున్నది. తైత్తిరీయసంహితా బ్రాహ్మణములలోని వాక్యములకిదియే నిజమైన అర్థము.

ఇదిగాక, ఋగ్వేదము పదియవ మండలములోనున్న 'వృషాకపి' సూక్తమునకెవరును యింతవరకు సరియైన భా వార్థమును చెప్పియుండలేదు. వృషాకపియనగ సూర్యుడని వ్యాఖ్యాతలందరును చెప్పిరి. కాని యెట్టి సూర్యుడు? శర ద్విషువత్ వద్ద ఉన్న సూర్యుడని యర్థము చెప్పినచో యీ కథకు చక్కని భావార్థమేర్పడుచున్నది. ఈ కథయేమనగ: పసుపు వర్ణముగల సూర్యుడు కనుపింపగనే యజ్ఞములన్ని

యు నిలిపివేయబడినవి. యజ్ఞములు నిలిచిపోవుటచే యింద్రాణికికోపమువచ్చెను. యజ్ఞములునిలిచిపోవుటకు కారణమైన యీమృగముయొక్క తలను నరికివేసెదననియు, యీమృగము వెంట వేటకుక్కను ఉసిగొలిపెదననియు యింద్రాణి భయపెట్టెను కాని, యీమృగము యింద్రునకు ప్రేమాస్పదమగుటచే యింద్రుడు చల్లని వాక్యములచే ఇంద్రాణియొక్క కోపమును శాంతింపజేసెను. అంతట యింద్రాణి ప్రసన్నురాలై తానీమృగమును చంపలేదనియు యింకొక మృగమును చంపితిననియు సమాధానము చెప్పెను.

అంతట సూర్యుడు (వృషాకపి) అధోలోకమందున్న తన నివాసమునకు పోవుచుండగ యింద్రుడువచ్చి వీడ్కొలిపెను. 'నీవు మరల తిరిగి నాయింటికిరావలసినదనియు, నీవు రాగనే యజ్ఞములను మరల ప్రారంభింపవచ్చుననియు' యింద్రుడు వృషాకపిని వేడుకొనెను. వృషాకపి మరల తిరిగి పైనున్న యింద్రుని యింటికి వచ్చినప్పుడు యింతవరకు యజ్ఞములను పాడుచేసిన ఆ దుష్టమృగము అదృశ్యమయ్యెను! యేమి చిత్రము? అంతట యింద్రుడును యింద్రాణియు, వృషాకపియు, (సూర్యుడును)—అందరును హాయిగ యింద్రుని యింటిలో కలిసికొందురు

సూర్యుడు శరద్విషువత్ వద్దనుండగ ప్రాచీనకాలమందు ఉత్తరాయణము (దేవయానము) పూర్తియగుచుండెను. దేవయానము పూర్తికాగనే యజ్ఞములుకూడ నిలిచిపోయెడివి. మరల సూర్యుడు తిరిగి వసంతవిషువత్ లోనికివచ్చు

పర్యంతము యజ్ఞములు నిలిచిపోయెడివి. మృగము గాన్పింపగనే యజ్ఞములు నిలిచిపోయెననగ అర్థమేమి? వసంతవిషువత్ మృగశీర్షలోనున్న యుగమందు సూర్యుడు శరద్విషువత్ వద్దనున్నచో సూర్యాస్తమానకాలమందుతూర్పునమృగశీర్షగాన్పించును. అనగ, సూర్యాస్తమానమందు తూర్పున మృగశీర్షగాన్పింపగనే దేవయానము పూర్తియైనదనియు యిక యజ్ఞముల నిలుపవచ్చుననియుగుర్తు. కనుక 'మృగము గాన్పింపగనే యజ్ఞములు నిలిచినవ'ను మాటకు భావార్థమిది. ఈ కారణముచే యింద్రునికి కోపమురాగా, మృగము తల నరికెదననియు, కుక్కలను ఉసిగొలిపెదననియు బెదరించెను. ఈ మృగము తలయే మృగశీర్షానక్షత్రము. కుక్కయనునదే శ్వాననక్షత్రము. సూర్యుడుతిరిగి యింద్రుని యింటికి (వసంత విషువత్లోనికి) వచ్చినప్పుడు మృగము గాన్పింపలేదు. అనగ సూర్యుడు మరల మృగశీర్షలోనికి వచ్చుటచే మృగము సూర్యుని కాంతిలో మునిగిపోయెను. వసంతవిషువత్తో దేవయానము ప్రారంభమగుటచే మరల యజ్ఞములు చేయుటకు వీలుగలిగెను. ఈకథ కూడ మనసిద్ధాంతమును బలపరుచుచున్నది.

---

[మరా — ఈకథలో నాకొక చిన్న అసంధర్భము గాన్పించుచున్నది. శరద్విషువత్ వద్దనున్న ఒక్క-సూర్యునికేగాక, పైనవర్ణితమైన మృగమునకుకూడ "వృషాకపి" యను పేరే యున్నది దీనిని సమన్వయించుటెట్లో నాకు తెలియకున్నది. తిలక్ గారుకూడ దీనిని సమన్వయింపలేదు, కారణమేమో తెలియదు — మానికొండ సత్యనారాయణశాస్త్రి — అనువాదకుడు]

కాని, ఈకథ కింతవరకును పాశ్చాత్య, పౌరస్త్యవ్యాఖ్యాత లెవరును చక్కనిసమన్వయమును గుదర్పలేకపోయిరి. అయి నను, మనమృగశీర్ష సిద్ధాంతమువలన యీకథను చాలవరకు సమన్వయింపవచ్చును ఇంతకంటె సహజమగు భావార్థ మును మరియొక రెవరైనను చెప్పువరకు యీయర్థమునే స్వీకరింపక తప్పదు.

# మృగశీర్ష

## ఎనిమిదవ అధ్యాయము.

### —◆ ఉపసంహారము. ◆—

చారిత్రకయుగమును దాటిపోయిన పిమ్మట, కాలనిర్ణయముజేయుటకై మనకు విశేషమైన ఆధారములేమియు గానరావు కాని మనకు కేవలమితిహాసరూపమైన గడియారములు లేకపోయినను సర్వేశ్వరుడొసంగిన బ్రహ్మాండగోళము నీపెద్దగడియారము మాత్రము మనకుగలదు ఈగడియారమును మానవమాత్రులెవరును నశింపజేయలేరు. ఖగోళమందలి జ్యోతిర్మూర్తులన్నియు కర్మసూత్రములచే గట్టుబడి నియమానుసారముగ తిరుగుచున్నవి. కనుక, వేదకాలనిర్ణయమొనర్చుటకై మనకీగడియారమెంతయో సాయమొనర్ప గలదు. ఈగడియారమిచ్చు నిర్ణయమునకు తిరుగుండజాలదు.

ఆర్య సంతతులవారందరును కలిసియున్నప్పుడు తాము కన్నారజూచిగాని, తమ పూర్వులనుండి వినిగాని, యున్నఖగోళాంశములను వారు తమ ప్రాచీన గ్రంథములందు భద్రపరచియున్నారు. వీని యాధారముచే మన మీ వేదకాల నిర్ణయ మొనర్పబూనితిమి. గ్రీకు, పారశీక, జర్మను జాతుల వారి పురాతనగాథల సహాయముతో, హిందూర్యులు తమ యప్రతిమానమేధా సంపత్తిచే భద్రపరచియుంచిన

కాలసూచకములగు వాక్యముల నిజార్థమును మనమిప్పుడు గోకమునకు వెల్లడింపవచ్చును

ఒకప్పుడు నూతన సంవత్సరము ఫాల్గుణ పౌర్ణమినాడు హిమసంక్రమణమువద్ద ప్రారంభమాయెనని తైత్తిరీయసంహితలో నుదహరింపబడిన పూర్వవృత్తాంతముయొక్క నిజార్థమును మనమింతవరకు సంతృప్తికరముగ స్థాపింపగలిగితిమి.

కాని, 'చైత్రపౌర్ణమికూడ సంవత్సరాదియే' యని ఆ తైత్తిరీయ సంహితావాక్యములోనే చెప్పబడియున్నదిగద. దీని కర్థమేమి? ఇదికూడ పూర్వయుగపు వృత్తాంతమునే దెలుపుచున్నది. దీనివలన, మృగశీర్ష యుగమునకు పూర్వమొకప్పుడు హిమసంక్రమణమువద్ద చైత్ర పౌర్ణమినాడు నూతన సంవత్సర మారంభమయ్యెనని అర్థము. ఈ వాక్యముచే వేదకాలము మరి రెండువేల సంవత్సరములు వెనుకకు పోవుచున్నది. హిమసంక్రమణమువద్ద చైత్ర పౌర్ణమినాడు నూతన సంవత్సర మారంభమైనచో వసంతవిషువత్ పునర్వసు నక్షత్రములోనుండవలెను. అనగ, మృగశీర్షకంటె కూడ రెండు నక్షత్రములు వెనుకనుండియుండవలెను.

దీనికి ప్రమాణము లేమైనగలవేమో చూతము. ఈ వాక్యము మనలను అతిప్రాచీన కాలములోనికి గొంపోవుచున్నది. బహుశః అప్పుడప్పుడే 'సంవత్సరము' అను కాలమానము గుర్తింపబడుచుండెనని చెప్పవచ్చును. ఈ కాలమును

గూర్చి వేదములందు బహుకొద్ది ప్రమాణములు మాత్రమే గలవు. అచ్చటచ్చట చెదురుగ బహుకొద్ది చిహ్నములు మాత్రము నిలిచియున్నవి. గ్రీకు, పారశీక గ్రంథములందింత మాత్రముకూడ గానరాకున్నవి.

పునర్వసు ప్రథమ నక్షత్రమని చెప్పుటకు ప్రత్యక్షవాక్యములేమియు వేదములందుగానరావు. ఇది ప్రథమ నక్షత్రమను అర్థమిచ్చు 'అగ్రయన' వంటి పర్యాయ పదములు కూడలేవు. కాని, అతిప్రాచీన వేదకాలమునాటి కర్మకాండను పరిశీలించి చూచినచో పునర్వసు నక్షత్రమొకప్పుడు ప్రథమ నక్షత్రమైయుండవలెనను సూచనలు గాన్పించుచున్నవి. 'పునర్వసు' నక్షత్రమునకు 'అదితి' అధిష్ఠానదేవత. 'యజ్ఞయాగాది క్రతువులన్నియు అదితితో ప్రారంభమై, అదితితోడనే సమాప్తి కావలయున'ని అదితి దేవత కొక వరముగలదట—దీనికి ఐతరేయ బ్రాహ్మణము I, 7; తై॥ సం॥ VI, 1, 5, 1—ప్రమాణములు.

దానిలోనున్న కథ యీరీతిగనున్నది:— ఒకానొకప్పుడు 'యజ్ఞము' దేవతలనుండి పారిపోయెను. ఆకారణముచే దేవతలు యేక్రతువుచేయుటకును శక్యముగాకపోయెను. ఈయజ్ఞ మెక్కడికి పారిపోయెనో యెవరికిని తెలియలేదు. దేవతలందరీయవస్థలో పడియుండగ 'అదితి' వచ్చి సరియైన యజ్ఞోపక్రమణమును కనుగొనెనట దీనిభావార్థమేమి? పూర్వము యజ్ఞములను యెవరియిష్టము వచ్చినప్పుడు వారు చేయుచుండెడివారనియు, పిమ్మట కొంతకాలమునకిది బ

గుండ లేదని తలంచి అందుకును అదితి (పునర్వసు) తోడనే ప్రారంభింపవలయునని నిశ్చయించుకొనిరనియు తాత్పర్యము. కనుక అదితి (అనగ పునర్వసు) యజ్ఞోపక్రమణమునకు (సంవత్సరోప క్రమణమునకు) ప్రథమదశయని దీనివలన సిద్ధించుచున్నది. వాజసనేయసంహిత 4,19 లో అదితిని ‘‘ఉభయతఃశిరః” (రెండుతలలుగలది) అని వర్ణించిరి. అనగ యజ్ఞముయొక్క ఆద్యంతములు రెండును అదితిలో నున్నవని భావము అనగ, యజ్ఞములును, వానితో బాటు సంవత్సరములును, అదితితో (అనగ పునర్వసుతో) ప్రారంభమై అదితితోనే సమాప్తమయ్యెనని భావము. ఈయర్థమే వ్యాఖ్యానలకు కూడ మాన్యముగ నున్నది.

ఈసిద్ధాంతమే యజ్ఞకర్మ కాండలవలనకూడ స్థిరమగుచున్నది. యజ్ఞములో విషువద్దినమునకు (అనగ మధ్యదినమునకు) పూర్వము వచ్చు నాలుగవదినమునకు ‘‘అభిజిత్” దినమని పేరు. యజ్ఞములు వసంతవిషువత్తులో ప్రారంభమైనచో, యజ్ఞమధ్యదినము శరద్విషువత్తులో వచ్చును అనగ యజ్ఞమధ్యదినమునాడు సూర్యుడు శరద్విషువత్తులోనుండును. తత్పూర్వము, నాలుగుదినములక్రిందట— సూర్యుడు శరద్విషువత్తుకు ౪ డిగ్రీల దూరములోనుండును. ఇట్లు సూర్యుడు శరద్విషువత్తుకు పూర్వభాగమునందు ౪ డిగ్రీలదూరములోనున్న దినమునకు అభిజిత్ దినమని పేరు ‘‘అభిజిత్” అనమనగ, సూర్యుడు, అభిజిత్ నక్షత్రములోనున్న దినమనిఅర్థము

చెప్పుదము. కనుక, ఆకాలములో "అభిజిత్" నక్షత్రము శర ద్విషువత్తుకు పూర్వభాగమందు ర డిగ్రీలదూరములో నుండి యుండవలెను. వసంతవిషువత్ పునర్వసులోనున్నచో, శర ద్విషువత్ అభిజిన్నక్షత్రమునకుముందు షుమారు 5, 6 డిగ్రీ లలోనుండునని రాశిచక్రము జూచినచో స్పష్టముగాగలదు ఈస్థితిలో శరద్విషువత్ కు యీ అభిజిన్నక్షత్రమునకంటెదగ్గ రనున్న నక్షత్రమింకొకటిలేదు ఆకారణముచేతనే యీ అభిజిన్నక్షత్రము రాశిచక్రమునకు వెలుపలనున్నను దీనినే స్వీకరింపవలసిన అగత్యముగలిగినది. అందువలననే, యీ నక్షత్రమును ౨౮వ నక్షత్రముగ మనవారు పూర్వమొక ప్పుడు అంగీకరించుటకు కారణమైనది. సూర్యుడీ అభిజిన్న క్షత్రములోనికి వచ్చినప్పుడు 'విషువత్ దినమిక ర, ౫ రోజు లలో నున్నదనుమా' యని యాజ్ఞికులు గ్రహించెడివారు. అనగ, విషువత్ దినముననుగ్రహించుటకిది యొక సాధనముగ (గుర్తుగ) నుండెడిది. కాని, పిమ్మట కొంతకాలమునకు శ రద్విషువత్ ముందునకు జరిగిపోవుటచే యీ అభిజిన్నక్షత్ర ముయొక్క అవుసరముకూడ తప్పిపోయెను. అభిజిన్నక్షత్రము యొక్క ప్రయోజనమిట్లు తప్పిపోవుటచేతను, యిది రాశి చక్రములోనుండక ప్రక్కగదూరములోనుండుటచేతను దీనిని నక్షత్రవర్గములోనుండి తీసివేసిరి. కనుక మనకిప్పుడు ౨౭ నక్షత్రములేయున్నవి. వసంతవిషువత్ మృగశీర్షలోనికి వచ్చి నప్పుడీమార్పు గలిగియుండవచ్చునని మనమూహించవ చ్చును.

మూల, జ్యేష్ఠనక్షత్రముల యుత్పత్త్యర్థమునుగూర్చి బెంట్లీపండితుడుచేసిన యూహ మనయూహను మరింత బలపరుచుచున్నది. కర్మకాండలోని అభిజిత్ దినముయొక్క స్థానమునుబట్టి అదితి (పునర్వసు) ఒకప్పుడుసంవత్సరారంభ దినముగ నుండియుండవలెనని సిద్ధమగుచున్నది. అదితి సరియైన యజ్ఞోపక్రమణ దినముగ కనుగొనెనను పురాతన గాధ కిదియే నిజమైనభావార్థము. అట్లయినచో, అదితి (పునర్వసు) దేవపితృయానముల సరిహద్దులోనుండెనని తాత్పర్యము. అందుచేతనే అదితిదేవి దేవతలకు తల్లియని ఋ X 72, 5, లోగలదు ఈ అదితినుండియే ఆదిత్యులు పుట్టిరని ఋ X, 72, 8, శతపథబ్రాహ్మణము III, 1, 3, 2 లో గలదు. అనగ, యీ అదితినుండియే సూర్యుడు తన (సంవత్సర) ప్రయాణమును ప్రారంభించెనని అర్థము.

ఇంకొక ప్రమాణము. కాలస్వరూపుడైన బ్రహ్మకు మేషము తలయనియు, వృషభము ముఖమనియు......యీరీతిగ బాదరాయణులవారు బ్రహ్మను వర్ణించిరి [యోవైనక్షత్రియం ప్రజాపతింవేద । ఉభయోరేనంలోకయోర్విదుః । హస్తయేవాస్యహస్తః । చిత్రాశిరః । నిష్ట్యాహృదయం । ఊరూవిశాఖే । ప్రతిష్ఠానూరాధాః । ఏషవైనక్షత్రియః ప్రజాపతిః— మేషఃశిరోఽథవదనం వృషభోవిధాతుః వక్షోభవేన్మిథునం హృదయంకులీరః । సింహస్తథోదరమథోయువతిః కటిశ్చ బస్తిస్తులాభృదత్ మేహనమష్టమఃస్యాత్ ॥. ధన్వీచాస్యో

ర్యగం మకరోజానుద్వయంభవతి జంఘాద్వితయంకుంభః పాదామత్స్యద్వయం చేతి॥—

ప్రజాపతికి చిత్రనక్షత్రము తల; స్వాతి హృదయము; హస్త హస్తము, విశాఖ తొడలు, అనూరాధ పాదము.' ఈ రెండు వర్ణనలును ఒక పోలికగనేయున్నవి. రాసులలో నికెల్ల ప్రథమ రాశియైన మేషము బ్రహ్మకు తలగ నెట్లు వర్ణింపబడెనో—ఆరీతిగనే, చైత్ర పౌర్ణమితో సంవత్సరమారంభమైనప్పుడు, చిత్రనక్షత్రమును ప్రజాపతియొక్క తలగ వర్ణించుటలో నాశ్చర్యమేమున్నది.? ఈవర్ణనకూడ మనసిద్ధాంతమునకు కొంత చేయూత నొసంగుచున్నది

ఈప్రమాణముచే చైత్ర పౌర్ణమినాడు హిమసంక్రమణమువద్ద సంవత్సరమారంభమయ్యెనను తైత్తిరీయసంహితావాక్యమునకు మిక్కిలిబలము చేకూరుచున్నది. ఈప్రమాణములు మృగశీర్షనక్షత్రమునుగూర్చి చెప్పిన ప్రమాణములంత బలకరమైనవిగ గాన్పింపకపోయినను, పాశ్చాత్యపండితులుచూపిన ప్రమాణములకంటె వెయ్యిమడుంగు లెక్కువ బలకరమైనవని చెప్పుట కెంతమాత్రమును సందేహము లేదు.

దీనిబట్టి అతిప్రాచీనకాలమునాటి ఖగోళజ్ఞానమంతయు కేవలము కర్మకాండాత్మకమై యున్నదనుట నిర్వివాదాంశము వసంతవిషువత్ అదితిలో (పునర్వసులో) నుండగ అప్పటియాజ్ఞ్యులు యజ్ఞయాగాది వత్సరక్రతువులను, వాని

తోపాటు నూతనసంవత్సరమును ప్రారంభించెడివారు. చంద్రునివృద్ధిక్షయములు, ఋతుభేదములు, అయనములు—మొదలగు ప్రకృతిలీలల తోడ్పాటుచే వారు తమకర్మకాండకు కావలసిన ముహూర్తకాలాది నిర్ణయముల జేసికొనెడివారు. సూర్యుడు అభిజిన్నక్షత్రములోనికి రాగనే విషువత్ దినము (యజ్ఞమధ్యదినము) సమీపించుచున్నదని వారు గ్రహించెడివారు. అటుపిమ్మట కొంతకాలమునకు—విషువత్ యింకను మృగశీర్షలోనికి రాకపూర్వమే—చాంద్రమానమును, తిథులును బయలుదేరుట కొంచెము మించుమించుగ పంచాంగమంతయు మార్పుజెందెను. నూతనసంవత్సరము చైత్రపౌర్ణమినాడు హిమసంక్రమణమువద్ద ప్రారంభింపబడెను. కాని, కర్మకాండలో మాత్రము విశేషముమార్పులు జరిగినట్లు గాన్పింపవు. అప్పటినుండి కర్మకాండయు, పంచాంగమును వేర్వేరుగనే యున్నట్లు గాన్పించుచున్నది. ఈస్థితి కొన్నిమార్పులతో యిప్పటికిని నిలిచియున్నది.

మనకిప్పుడు లిఖితరూపముగ వేదములయందు బొందుపరపబడిన ఖగోళాంశ సాధనములచే కాలగర్భములోనికి జొరబడగలిగినంతవరకును జొచ్చిచూచెదముగాక! ఆర్యసభ్యతయందు ప్రథమయుగమునకు "అదితియుగ"మని కాని, 'పునర్వసుయుగ' మని కాని పేరిడుదము. ఈయుగముయొక్క వ్యాప్తి క్రీ॥ పూ॥ ౬ వేలు మొదలు ౪ వేల వరకు నని నిశ్చయింపబడినది. ఈకాలమందు ఆర్యసంతతులన్నియు కలిసియున్నవి అప్పటికింకను సర్వాంగపరిపూర్ణమైనసూక్తములు

బయలుదేరలేదనియు, గద్య పద్యాత్మకముగనున్న వాక్యములును. వానియందు దేవతలుచేసిన మహాత్కృష్టకార్యములగూర్చిన వర్ణనలుమాత్రమే గలవనియు తెలియుచున్నది. గ్రీకుపారశీకగ్రంథములందు యీ యుగమును గూర్చిన చిహ్నములేమియు గానరావు. బహుశః తదనంతరయుగమందు వారుచీలిపోయినప్పుడు, వారు అప్పటికాలపు పంచాంగమునే తమవెంట గొనిపోయిరేగాని, తత్పూర్వయుగపు పంచాంగమును గొనిపోలేదని దీనివలన నూహింపవలసివచ్చుచున్నది. కాని, హింద్వార్యులుమాత్రము యీ యతిప్రాచీనకాలమునాటి పంచాంగచిహ్నములను విడిచిపెట్టక మిక్కిలి భక్తితోడను, పట్టుదలతోడను, అవిచ్ఛిన్నముగ తమవాక్కోటికలందు భద్రపరచి యుంచిరి.

ఆర్య సభ్యతయందు ద్వితీయయుగమునకు 'మృగశీర్షాయుగ' మని పేరిడుదము. ఈ యుగవ్యాప్తి క్రీ॥ పూ॥ ౪ వేలు మొదలు ౨౫౦౦ వరకు. ఇది చాల సుప్రసిద్ధమైనయుగము ఋగ్వేదమునందున్న సూక్తములు చాలవరకు యీయుగమందే బయలువెడలెను. ఈ యుగమందే అనేక గాథలు బయలువెడలెను. తత్పూర్వమందున్న గాథలు మరింత విస్తరింపజేయబడెను. ఈ గాథలను చాల భాగము గ్రీకులు పారశీకులు కూడ భద్రపరచియుంచిరి. కనుక వీరి మృగశీర్ష యుగముయొక్క చివరభాగమందు [క్రీ॥ పూ॥ 3౫౦౦—3౦౦౦] చీలిపోయియుండవలెను. ఆ కారణముచేతనే, తదనంతరము రాబోవు కృత్తికా యుగము

యొక్క చిహ్నములు ప్రాచీన వేదములగు ఋగ్వేదమునందును గాని, గ్రీకు పారశీక గ్రంథములందుగాని కానరాకున్నవి. దీనిని కొంచెమించుమించుగా సూత్రయుగమని చెప్పవచ్చును.

ఆర్య సభ్యతయందు తృతీయ యుగమునకు 'కృత్తికా యుగ' మని పేరిడుదము. దీనివ్యాప్తి క్రీ॥ పూ॥ ౨౫౦౦ మొదలు ౧౪౦౦ వరకు. ఈయుగమందే తైత్తిరీయ సంహిత యు, పెక్కు బ్రాహ్మణములును బయలువెడలినవి ఇప్పటి కప్పుడే ఋగ్వేదసూక్తములు పురాతనములును అగ్రాహ్యములును నైపోయెను ఆకారణముచే, ఋగ్వేద సూక్తముల యొక్కయు, అందున్న గాథలయొక్కయు నిజార్థమును గ్రహింపలేక అప్పటికే బ్రహ్మవాదులు వీనికి తమతమ యిష్టము వచ్చినట్లు అర్థములుచెప్ప మొదలిడిరి. బహుశః యీకాలమందే సంహితలనన్నిటిని ఒక విధమగు క్రమములోనికి దెచ్చిరని యూహింపవచ్చును. పురాతన సూక్తములకు నిజార్థమును కనుగొనుటకిప్పుడే యత్నములు జరిగియుండవచ్చును. బహుశః యీకాలమందే భారతీయులకును చీనావారికిని సంయోగముగలిగియుండును. ఈకాలమందే చీనావారు మన హిందువుల నక్షత్ర పద్ధతిని నేర్చుకొనిరి.

ఆర్యసభ్యతయందు చతుర్థయుగమునకు "ప్రాచీనసంస్కృతయుగ" మని పేరిడుదుము. దీనివ్యాప్తి క్రీ॥ పూ॥ ౧౪౦౦ మొదలు ౫౦౦ వరకు. (అనగ, బౌద్ధయుగమువరకు) ఈయుగమందే సూత్రములును, వేదాంతసిద్ధాంతములును బయలుదేరెను,

[ఈయుగముల వ్యాప్తివిషయమై ఖండితమైన అంకెల నిచ్చుటకు వీలులేదు. పైనచెప్పిన అంకెలు షుమారు ౩,౪ వందల సంవత్సరములు అటునిటుగ నుండును. వేలకొలది సంవత్సరములనుగూర్చి మాట్లాడుచున్నప్పుడు యీవందల నొకలెక్కగ పరిగణింపబనిలేదు.]

మనమిప్పుడు క్రీ॥ పూ॥ ౬ వేల సంవత్సరములవరకు పోతిమి ఆకాలమందున్న పంచాంగలక్షణములను మాత్రమే గుర్తించితిమి. ఈలక్షణములు ఆకస్మికముగ ఒక్కనాడే పుట్టియుండవు. ఇందలి జ్ఞానమంతయు కలిగి, యిట్టిపంచాంగచిహ్నములు బయలువెడలుటకు యెన్ని సంవత్సరములు పట్టునో చెప్పజాలము. కనుక నిజమాలోచించినచో, ఆర్యసభ్యత యింకను పురాతనమైనదేయని చెప్పవలెను. కాని, గాలిలో మేడలుగట్టిన ప్రయోజనములేదు, ఊహాప్రపంచమును వదలి, వేదములయందు మనకు గాన్పించుచున్న బలవత్తరమైన ప్రమాణములమీదనే మనసిద్ధాంతమును నిలువబెట్టుదుము. యీరీతిని విచారించినచో, హిందూపారశీక గ్రీకు గ్రంథములలో నుదాహరింపబడిన గాథలన్నియు మృగశీర్షయుగములో ఋగ్వేదమునందు సూక్తములరూపమున బొందుపరుపబడినవని తెలియుచున్నది. ఈయుగవ్యాప్తి క్రీ॥ పూ॥ ౪౦౦౦—౨౫౦౦॥ శబ్ద సాదృశములనుబట్టి చూచినను హిందూ పారశీక గ్రీకుగ్రంథములలోని దేవతల పేర్లకును వారికృత్యములకును, అత్యంతమైన పోలికగన్పట్టుచున్నది. కనుక యీసూక్తములు ఆయుగములోనే— ఆర్య

సంతతులన్నియు కలిసియున్నప్పుడే—బయలు వెడలియుండ వలెను. అయినను మనసిద్ధాంతము కేవలము శబ్దసాదృశ్యములపైగాక, వేదమునందు ప్రత్యక్షముగ గాన్పించు కాల సూచకములగు ప్రమాణవాక్యములపై ఆధారపడియున్నది. కనుక, యీ పద్ధతి మాక్సిముల్లరు మొదలగు శబ్దశాస్త్రవేత్తలవలంబించిన పద్ధతికంటె వేయిమడుంగులు బలవత్తరమైనదనుట కెంతమాత్రమును సందేహములేదు. మనచరిత్రలు తప్పినను జ్యోతిర్గోళములు తమగతులను తప్పజాలవు.

ఋతువులు వెనుకబడుటకు కారణము విషువత్ యొక్క చలనమేయని పైనవివరించితిమి. ఈ చలనము బహుసూక్ష్మమగుటచే ఆదియందు మనయార్యులు దీనినిగుర్తింపనిమాట నిజమే కాని, కొంతకాలమునకు ఋతువులు వెనుకబడుచున్నవని ప్రత్యక్షముగ కండ్లకు కాన్పింపగనే వారు గ్రహించిరి. కనుక వారు తమసంవత్సరాదిని అప్పుడప్పుడు మార్చుకొనవలసివచ్చెను. వారీరీతిగ తమ సంవత్సరాదిని పలుమారు మార్చుకొన్నట్లును, తమ పంచాంగములను కూడ తదనుగుణముగ పలుమారు సంస్కరించుకొన్నట్లును నిదర్శనములు గలవు. వానినిప్పుడే పరిశీలించెదము గాక. వారిట్లు తమపంచాంగమును సంస్కరించుకొనుటయేగాక, విషువత్ యొక్క గతినికూడ సరిగ కనుగొనిరి. దీని గతి సంవత్సరమునకు ౫౦.౧ శెకండులు (దూరము) అనిహిందూ జ్యోతిశ్శాస్త్రవేత్తలు కనిపెట్టిరి, ౩౬ శెకండులని గ్రీకులు చె

ప్పిరి. ఈకాలపు శాస్త్రవేత్తలు యంత్రసహాయముచే దీనిగతి సంవత్సరమునకు ౫౦ సెకండులని చెప్పిరి (ప్రాచీనజాతుల లోనికెల్ల మనభారతీయులే యీసూక్ష్మగతిని యెక్కువ సరిగ కనిపెట్టగలిగిరి! ఇంతటిసూక్ష్మగతిని భారతీయులు, గ్రీకులకంటెకూడ, యెక్కువసరిగ యెట్లుకనిపెట్టగలిగిరో యని విట్నీ పండితుడు ఆశ్చర్యపడుచున్నాడు! "అదృష్టవశాత్తు వీరుచేసిన యూహ కాకతాళన్యాయముగ సరిపోయి యుండవచ్చున"ని యీతడు తనమనస్సును సమాధాన పరుచుకొనుచున్నాడు! భారతీయులకు నిజమైన తెలివితేటలున్నవని యొప్పుకొన్నచో తమపాశ్చాత్య ప్రతిభకు తమ సభ్యత యొక్క ఆధిక్యతకు—భంగమువచ్చునేమోయను దురాగ్రహముచే యీతడిట్లు పలుకుచున్నాడు.

విషువత్ యొక్క చలనమున కనుగుణముగ మనవారెట్లు పంచాంగమును సంస్కరించుకొనుచువచ్చిరో విచారింతము.

I [మృగశీర్షనుండి—రోహిణికి] కాలాధిష్ఠాన దేవతమైన రోహిణివైపునకు జరుగుటచే రుద్రుడు ప్రజాపతిని చంపెను. ప్రజాపతియొక్క యీచర్య అసాధారణమైనదని (అకృత) ఐత॥ బ్రా॥ III, ౩౩ లో గలదు. కనుక, యీచర్య దేవతలందరిచేతను తీవ్రముగ ఖండింపదగియున్నదట. దీనిభావార్థమేమి? అనగ, విషువత్ మృగశీర్షలోనుండి క్రమక్రమముగ—మెల్లగ— రోహిణిలోనికి జరుగుచుండెనని తాత్పర్యము. ఈచలనమును వారిదివరకెన్నడును గుర్తించలేదు, విషువత్

యొక్క చలనమును ఆర్యులు గుర్తించుటకిదియే ప్రథమ పర్యాయము. కనుక, వారి కిది యెంతయో ఆశ్చర్యమును కలుగజేసెననుటలో సందేహము లేదు. ఆకారణముచేత నే ప్రజాపతియొక్క యీచర్య అసాధారణమైనదని (అక్రృత) ఐతరేయ బ్రాహ్మణము వర్ణించినది. ఇటుగాక సూర్యుడు క్రమక్రమముగ రోహిణిమీదికి యెక్కివచ్చుచుండుటచే ఆ నక్షత్రమునకు ,,రోహిణి" (యెక్కిజరుగుచున్న) అను పేరు వచ్చినదని చెప్పవచ్చును. కనుక, యీగాథ మృగశీర్షయుగములో విషువత్ మృగశీర్షనక్షత్రమునుదాటి రోహిణివైపునకు వచ్చుచుండగ పుట్టియుండవలెను. ఈయుగములో ఫాల్గుణ పౌర్ణమిసంవత్సరాదిగ నుండెను.

II [రోహిణినుండి—కృత్తికకు] విషువత్ కృత్తికలోనికి రాగనే ఋతువులు సరిగ ఒక్కమాసము వెనుకబడుటచే అప్పటివారు తమ సంవత్సరాదిని ఫాల్గుణ పౌర్ణమినుండి మాఘ పౌర్ణమికి మార్చిరి. నక్షత్రములనుగూడ తదనుసారముగ మృగశీర్ష (అగ్రయన) నుండి లెక్కించుట మానివేసి కృత్తికలనుండి లెక్కింప మొదలిడిరి.

III [కృత్తికనుండి—భరణికి] ఇక్కడనుండి మూడవమెట్టు వేదాంగ జ్యోతిషకాలము. (అనగ ధనిష్ఠా నక్షత్రము హిమసంక్రమణము వద్దనున్నప్పుడు) ఇప్పుడు ఋతువులు ఒక పక్షము (౧౫ రోజులు) వెనుకబడెను కనుక సంవత్సరాదిని మాఘ పౌర్ణమినుండి మాఘ శుద్ధ పాడ్యమికి మార్చ

కొనిరి. [బహుశః ప్రతినెలయు శుద్ధ పాడ్యమినుండి ప్రారంభమగుటకిదియే కారణమైయుండును.]

IV [భరణినుండి—అశ్వనికి] ఇక్కడనుండి మనకు లిఖితపూర్వకముగనున్న మార్పు ఒక్కటేగలదు. అనగ, విషువత్ కృత్తికలలోనుండి అశ్వనీలోనికి వచ్చినప్పుడు, ఒకప్పుడు ఋతువులు ౧౫ దినములు వెనుకబడుటచే ఒక సిద్ధాంతి పంచాంగమును తదనుసారముగ సంస్కరింపదలచెను. కాని, ఆ ప్రయత్నము వ్యర్థమయ్యెను. ఈ ప్రయత్నమును సూచించు కథయొకటి భారతఖండమందు గలదు. [మహాభారతము: ఆదిపర్వము, 71, 34:—చకారాన్యం చ లోకం వై క్రుద్ధో నక్షత్రసంపదా। ప్రతిశ్రవణపూర్వాణి నక్షత్రాణి చకార సః॥]—

అశ్వమేధపర్వము: 44. 2:—అహః పూర్వం తతో రాత్రిః మాసాః శుక్లాదయః స్మృతాః। శ్రవణాదీని ఋక్షాణి ఋతవః శిశిరాదయః॥]

"విశ్వామిత్రుడు క్రొత్తప్రపంచమును సృష్టింపదలంచెను, నక్షత్రములను ధనిష్ఠకు బదులు శ్రవణనక్షత్రముతో ప్రారంభింపదలంచెన"ట ఇట్టికథయే అశ్వమేధపర్వములోను, పురాణములలోను గలదు. కాని, యీయత్నము సాగలేదు కనుక, వేదాంగజ్యోతిషకాలమునాటి పద్ధతి అశ్వనీకాలమునాటి వరకన్నే నిల్చియుండెను.

V. వరాహమిహిరుని సంస్కారణము; ఇక యిప్పుడు చేయువలసినమార్పు. పిమ్మట క్రీస్తు శకానంతరము ౫. వ శతాబ్దములో వరాహమిహిరుడువచ్చి యీ అశ్వనిపద్ధతిని నెలకొల్పెను. సంవత్సరాదిని మరల హేమసంక్రమణమునుండిమార్చి ఆదిస్థానమైన వసంతవిషువత్ వద్దకుచేర్చెను. యీ పద్ధతి యీరోజువరకు అములులోనున్నది. ఈ పద్ధతిపుట్టి యిప్పటికి షుమారు ౧౫౦౦ సంవత్సరముల పైగాఅయినది యిప్పుడు విషువత్ రేవతినికూడ దాటిపోయినది.*

ఈప్రకారము, అవిచ్ఛిన్నముగ ప్రాచీనకాలమునుండి నేటివరకు పంచాంగములు విషువత్ చలనమున కనుగుణముగ అప్పుడప్పుడు సంస్కరింపబడుచు వచ్చినవని చెప్పుటకు ప్రబలమైన ప్రమాణములుగలవు.

ఆర్య సంతతులుకలిసి యున్నప్పుడే వేదములుపుట్టినవని పాశ్చాత్యులు ఒప్పుకొనియున్నారు. కాని, విషువత్ మృగశీర్షలోనున్నప్పుడే ఆర్యసంతతులుకలిసి యుండిరను సంగతిని మాత్రము వారుగుర్తించలేదు ఈయంశము వారు గుర్తించి యుండినచో వారువేదకాలము క్రీ॥ పూ॥ ౨౪౦౦ సంవత్సరములేయని చెప్పియుండరు. మనలెక్క ప్రకారము వే

---

* కనుక, మనయిప్పటిపంచాంగములను సంస్కరింపవలసిన అవసరమెంతేనిగలదు. మనసంవత్సరాదిని షుమారు ౨౦ రోజులు వెనుకకు నెట్టవలెను. దీనిని మనసిద్ధాంతులు గమనింతురుగాక — మారేపండ సత్యనారాయణశాస్త్రి, అనువాదకుడు]

దకాలము యెంతతక్కువగ జూచినను క్రీ॥ పూ॥ ౪౦౦౦ సంవత్సరములపై మాటయేగాని తక్కువగాదని తేలుచున్నది.

ఇక మన భారతీయులలో చాలమంది పండితులు వేదకాలము 'అనాది' యని తలంచుచున్నారు. అనగ, వీనికి 'ఆది' యే లేదనియు, ప్రపంచము పుట్టుకతోడనే యివి పుట్టినవనియు మనవారు తలంచుచున్నారు భగవంతుని ముఖము నుండి వచ్చిన మాటలు ,, అనాది ,, గ నుండనక్కరలేదు. భగవంతుడు యేదోయొక కాలమున యీ వేదములను ప్రవర్తింపజేసియుండవచ్చును. కనుక వీనికి 'ఆది' యుండవచ్చును. ఉదాహరణమును:—క్రైస్తవుల బైబిలును, మహమ్మదీయుల ఖొరానును భగవద్వాక్యములే. ఇవి ఒకానొక కాలమున భగవంతుని ముఖమునుండి యుద్భవిల్లినవని ఆ మతములవారు తలంచుచున్నారు కనుక, వీనికి 'ఆది' గలదు ఈ రీతిగనే, వేదములకుకూడ 'ఆది' యుండుటలో ఆశ్చర్యము లేదు—అసంభవముకాదు. వేదములు భగవంతుని ముఖమునుండివచ్చిన వన్నంతమాత్రముచేత, వానికి 'ఆది' యుండదని సిద్ధింపజాలదు * వేదముల యుత్పత్తికాలము బహు ప్రాచీనమగుటచే—యిప్పటికి షుమారు 7, 8 వేల సంవత్సర

---

* ఈ అభిప్రాయములలో కొలది దృష్టాంతములను తిలక్‌గారు చేసియున్నారు వీరు రచించిన "ఆర్యుల ఉత్తర ధృవనివాసము" ను గ్రంథముయొక్క చివరి అధ్యాయమును చూడదగును.

మా. స. నా. శాస్త్రి—అనువాదకుడు.

ములగుటచే—వేదములను 'అనాది' యని అలంకారమాత్ర ముగ చెప్పిన చెప్పవచ్చును. వేదములు అతివిరివిగ ప్రబలిన కాలము యిప్పటికి ఆరువేల సంవత్సరములకు తక్కువగాదని యీ గ్రంథమందు నిరూపించితిమి.

వేదకాలమునింకను కాలగర్భములోనికి గొనిపోవుటకు నిదర్శనములున్నవి. కాని, అప్పటికాలస్థితి మనకు అగమ్యమగుటచే, వేదములకు 'ఇది' యే లేదను నభిప్రాయము మనలో ప్రబలినది. కనుక, వేదకాలమును క్రీ॥ పూ॥ ౪౨౦౦ సంవత్సరములకు తక్కువగాదని చెప్పినచో పాశ్చాత్య పౌరస్త్య పండితుల యభిప్రాయములకు కొంతవరకు సరిపోవుచున్నదని చెప్పవచ్చును. ఈ రీతిని, కర్మ సూత్రానుసారముగ నియమితపథమందు తిరుగుచున్న జ్యోతిర్గోళముల చలనాదుల ఆధారముచే వేదకాలమును నిర్ణయించుటకు మనము కొంత పరిశోధన చేసితిమి. పండితలోకమీ పరిశోధనను మరింత యెక్కువగ జేసి, ప్రపంచవిజ్ఞానాభివృద్ధికి తోడ్పడుదురుగాక —

ఓం శాంతిః, శాంతిః, శాంతిః

ఓం తత్ సత్ బ్రహ్మార్పణమస్తు.

సంపూర్ణము.

# అనుబంధము

## ఋగ్వేదము: పదవ మండలము.

### వృషాకపిసూక్తము.

విహిసోతోరసృక్షత నేంద్రం దేవమమంసత । యత్రామదద్వృషాకపిరర్యః పుష్టేషుమత్సఖావిశ్వస్మాదింద్రఉత్తరః॥౧

పరాహీంద్రధావసి వృషాకపేరతివ్యథిః । నోఅహప్రవిందస్యన్యత్రసోమపీతయేవిశ్వం॥౨

కిమయంత్వాం వృషాకపిశ్చకారహరితోమృగః । యస్మాఇరస్యసీదున్వర్యోవాపుష్టిమద్వసువిశ్వం॥౩

యమిమంత్వంవృషాకపిం ప్రియమింద్రాభిరక్షసి। శ్వాన్వస్యజంభిషదపికర్ణేవరాహయుర్విశ్వం॥౪

ప్రియాతష్టాని మేకపిర్వ్యక్తావ్యదూదుషత్ । శిరోన్వస్యరావిషంనసుగందుష్కృతేభువంవిశ్వం॥౫

నమత్స్త్రీసుభసత్తరానసుయాశుతరాభువత్ । నమత్ప్రతిచ్యవీయసీనసక్థ్యుద్యమీయసీవిశ్వం॥౬

ఉవేఅంబసులాభికేయథేవాంగభవిష్యతి । భసన్మేఅంబసక్థిమేశిరోమే వీవహృష్యతివిశ్వం॥౭

కింసుబాహోస్వంగురేపృథుష్టోపృథుజాఘనే।కింశూరపత్నినస్త్వమభ్యమీషి వృషాకపింవిశ్వం॥౮

అవీరామివమామయం శరారురభిమన్యతే । ఉతాహమస్మి వీరిణీంద్రపత్నీమరుత్సఖావిశ్వం॥౯

సంహోత్రంస్మ పురానారీసమనంవావగచ్ఛతి । వేధాఋతస్యవీరిణీంద్రపత్నీమహీయతేవిశ్వం॥౧౦

ఇంద్రాణీమాసునారిషుసుభగామహమశ్రవం । నహ్యస్యాఅపరంచనజరసామరతేపతిర్విశ్వం॥౧౧

నాహమింద్రాణి రారణసఖ్యుర్వృషాకపేరృతే । యస్యేదమప్యంహవిఃప్రియందేవేషుగచ్ఛతివిశ్వం॥౧౨

వృషాకపాయి రేవతిసుపుత్రఆదుసుస్నుషే । ఘసత్తఇంద్ర ఉక్షణః ప్రియం కాచిత్కరంహవిర్విశ్వం॥౧౩

ఉక్ష్ణో హిమే పంచదశ సాకంపచంతి వింశతిం । ఉతాహామ ద్మిపీవఇదుభా కుక్షీ పృణంతి మేవిశ్వం॥౧౪

వృషభోనతిగ్మ శృంగోన్తర్యూథేషు రోరువత్। మంథస్త ఇంద్రశం హృదేయంతే సునోతిభావ యుర్విశ్వం॥౧౫

నశేషే యస్యరంబతేంతరా సక్థ్యా కపృత్ । సేదీశే యస్యరోమశం నిషేదుషో విజృంభతే విశ్వం ॥౧౬

నసేశే యస్యరోమశం నేషేదుషో విజృంభతే । సేదీశే యస్యరంబతేంతరా సక్థ్యాకపృద్విశ్వం ॥౧౭

అయమింద్ర వృషాకపిః పరస్వంతం హతంవిదత్ । అసిం సూనం నవంచరూమా దేధస్యాన ఆచితం విశ్వం ॥౧౮

అయమేమి విచాకశద్విచిన్వన్దాసమార్యం । పిబామిపాక సుత్వనోభి ధీరమచాకశంవిశ్వం॥౧౯

ధన్వచయత్కృంతత్రం చకతిస్విత్తావియోజనా । నేదీయసో వృషాకపేస్తమే హిగృహా ఉపవిశ్వం॥౨౦

పునరేహి వృషాకపేసువితా కల్పయావహై । యఏషః స్వప్ననంశనో స్తమేషి పథాపునర్విశ్వం॥౨౧

యదుదంచో వృషాకపే గృహమింద్రాజగంతన। క్వస్య పుల్వఘో మృగఃకమరజ్జనయోపనో విశ్వం॥ ౨౨

పర్శుర్హనామమానవీ సాంకససూవవింశతిం । భద్రంభల త్యస్యా అభూద్యస్య ఉదరమామయద్విశ్వం॥౨౩

---

సవరణ

122 పేజీ, చివరపంక్తి 'సూక్యస' అనుటకు బదలు 'మృగము' అని చదువుకొనవలెను.

128 పేజీ 15వ పంక్తి 'దేవతయైన రోహిణి వైఘ్రనకు' అనుటకు బదులు 'దేవతయైన ప్రజాపతి రోహిణి వెపు-' అనిచదువుకొనవలెను